# ప్రజ్ఞా కౌస్తుభము

రచన
కీ.శే. బ్రహ్మశ్రీ మద్దులపల్లి వీరరాఘవశర్మగారు
తెలుగు పండిట్
మునిసిపల్ హైస్కూల్
నంద్యాల

# ప్రజ్ఞా కౌస్తుభము

రచన

కీ.శే. బ్రహ్మశ్రీ మద్దులపల్లి వీరరాఘవశర్మగారు
తెలుగు పండిట్
మునిసిపల్ హైస్కూల్
నంద్యాల



సీ. ఘనుడు మద్దులపల్లి వనధిచంద్రుండైన
నరసింహసిద్ధాంతి నాకు తండ్రి
అనసూయకెనయై ఘనసాధ్వి వేంకట
సుబ్బమ్మ మా తల్లి సుకృత వల్లి
సుకవి విద్వద్గోష్ఠి సుశ్లోకు డగుశాస్త్రి
యలఘసుబ్రహ్మణ్యు డన్న గారు
వైదిక లౌకిక ప్రజ్ఞ నుద్దండుండు
శ్రీ గురునాధుండు చిన్నయన్న

తే. రామ నరసింహ తమ్ములు, లక్షణమగు
పుత్రులిద్దరు నరసింహమూర్తి యనగ
పాండురంగ మనంగ నొప్పారువారు
కలదు కృతిబిడ్డ యెందేని కావ బోదు

**కర్నూలు అవధాన మందున నొక పృచ్ఛకు**
**డడుగగా చెప్పిన ఆత్మకథా సంగ్రహ గీతమాల**

తల్లి పాలను వీడుటె తడవుకాగ
మేనమామగారింటిలో మెలగుచుంటి
అంత నైదేండ్ల వయసులో నాస్తి కొరకు
దత్తు పోవంగ కర్నూలు నుత్తరించి
ఔను కాదను వ్యవహార మంత కంత
కతిశయింపంగ మూడేండ్లు నందయుంటి
ఇంద్రకంటి శేషావధానీంద్రు డిడ్డ
పాఠశాల భుజించుచు బండవోలె
ఓనమాలైన రాకుండ యుంట జూచి
పాపశాస్త్రియనుగురుడు ప్రణతులిడుచు

శ్రీ గురుభ్యోనమ యని కుచేష్టసేయ
గడిపి యెట్లెట్లొ దేవుని కరుణచేత
అగుడు దత్తోట సంతోష మాత్మనెంచి
పదునొకండవ యేట మా పల్లెటూర
నొక్క పూటన జందెంబు నొనర దాల్చి
పదునొకండవ దినమున పయనమైతి
బావగారుండు సరిపల్లి పాఠశాల
నందు వేదంబు జదివితి నా సతోడ
వేంకటేశ్వరు సత్కృప వేదమందు
సంహితా భాగమంతయు సంగ్రహించి
పదము క్రమమును జటయును బాగనేర్చి
ఘనతరోదార మాధుర్య కంఠమెత్తి
స్వయముగా ఘన చెప్పితి శ్రావ్యమనగ
బహుళ బహుమానముల నంది భావమలర
గురుని సద్భక్తి పూజించి కొలిచి మరల
బ్రాహ్మణాధ్యయనంబు పూర్ణముగ జేసి
సంస్కృ తాంధ్రద్వయంబున శబ్దశాస్త్ర
మంత శోధించి సత్కవిత్వ మద్భుతముగ
చెప్పనేర్చిన ప్రోడనై యిప్పుడిటకు
వచ్చియున్నాడ కవిరాఘవాఖ్యతోడ.

క. ఇది వ్రాసితి గందాలలో
బదునైదవయేట నూరు పద్యంబులుగా
నది వానకు జెడిపోయెను
మొదలిటి వొక కొన్ని దొరక మొదటన నిడితిన్

క. మిత్రుల ప్రోత్సాహమున
న్నాత్రము గొలుపంగ నప్పటప్పటి వ్రాతల్
పాత్రత నొసగెను దీనన్
బాత్రలు పద్యాల భిన్న భావన దెల్పున్

ఉ. చిత్ర విచిత్ర చిత్రములు చిత్ర తమంబులుకావు భావనా
చిత్రము చెంత-నంబరపు చిత్రము చిన్నది, దాని గన్న వా
డాత్రము జెందునే? యది యనంత ముదావహ మవ్యయంబు ధీ
పాత్రుడు గాంచు గాక యొక పామర మాత్రుడు కాంచ నేర్చునే?

# ప్రజ్ఞాకౌస్తుభము

## ప్రథమాశ్వాసము

క. శ్రీ కరుణా పరిపూర్ణుఁడు
ప్రకట నిగమాంత వేత్త, భవ్య చరిత్రుం
డా కృతి మదనుఁడు, సుగుణ గ
ణాకరుఁ డొక బ్రాహ్మణుండు హాయిగ నుండెన్ 1

క. ఆతడు వైరాగ్యముతో
శీతాఽఽతప వర్షభీతిఁ జెందక చని కా
శీ తలి మంగళ గంగనుఁ
జేతః పరిశుద్ధి మునిఁగి శివునర్చించున్ 2

క. దిన దిన మిటు సలుపంగా
ఘనుఁ డొక సన్యాసి వచ్చి కరమునఁ గాయం
బు నిమిరి వరమడుగుము నా
యన! యన సన్యాస మడిగె నతఁ డతి భక్తిన్ 3

క. అన్యం బొల్లక యడిగిన
సన్యాసము నొసగి యతఁడు చయ్యనఁ జనఁగా
ధన్యుఁడ నయితిఁ గదా! యని
యన్యుల కీ యోగ మబ్బ నలవియె ? యనుచున్ 4

క. గంగా తరంగముల వలెఁ
బొంగారెడు నంతరంగ ము ద్రస మిమిడిం
పంగా ద్విజ పుంగవు నం
గాంగంబులు చాలవయ్యె నది యెంతటిదో 5

క. ఇటు సన్యాసముఁ గైకొని
పటుతర మోదంబు నంది బాపడు భవలం
పటతల్ వీడెను, దప ము
త్కటముగ నొనరించెఁ గొంత కాలము గడచెన్ 6

క. అంతటఁ దాఁ జేసిన తప
మింతైన ఫలింపకునికి నిహపరములకున్
హంత! చెడితిఁ గద! యని కడుఁ
జింతిలి, యిక నెట్లు ముక్తి చేకురు ననుచున్ 7

క. అనవరతము వ్యాకుల మగు
మనమునఁ దన తపము మాట మాని మహా చిం
తను మునిగి తేలుచు నచటఁ
దన కెవ్వరు దిక్కు లేమిఁ దలచుచు జనియెన్ 8

క. చనిచని యున్మత్తుని వలె
వనవనమును దిరిగి తిరిగి పాపము! విసుగె
త్తి నిలిచి యుండఁగ నొకచోఁ
గనఁబడె నొక రాతి మీఁదఁ గన దక్షరముల్ 9

క. యతి వానిఁ జదువు కొనియెను
ధృతిమతి యత్నే కృతే యది న సిధ్యతి కోఽ
త్ర తు దోష యంచు నుండగ
సతతంబును దాని మానసంబునఁ దలచున్ 10

క. యత్నింపక సిద్ధింపదు
యత్నింపఁగ సిద్ధికామి యది తప్పగునే?
యత్నించినఁ దేఁ గూడదె ?
రత్నాకరు నొద్ద నుండు రత్నము లైనన్ 11

క. అని యూహించుచు మును తా
నొనరించిన తపము స్వల్ప మోహో! యనుచున్
తనలోఁ బున రుత్సాహము
మొనలెత్తఁగ మరియు నిట్లు బుద్ధిఁ దలంచెన్ 12

క. ఈ శాసన సూక్త్యర్థ ము
మేశాదుల కైనఁ జాడ నెరుగం దరమే!
యే శాస్త్రకర్త చెప్పెనొ!
దేశంబున కనుభవోపదేశము కాఁగన్ 13

క. ఏ కర్తవ్యముఁ దోపక
వ్యాకుల పడి చెడెడు నట్టి పాపాత్మునకున్
నాకిది కనఁబడు టెంత య
నేక జనుః పుణ్య ఫలమొ ? యెన్నఁగ వశమే ? 14

క. దీనంగల మహి మాదిక
మేనుం గని తీరవలయు నే మైన సరే!
పూనెద ధైర్యము నీ నా
దీనత వీడెద ముముక్ష దీక్షితు నగుదున్ 15

క. అని నిశ్చయించు కొనియును
మనమున మఱి యొక్క రీతి మఱి చింతించెన్
జనుఁ డాముష్మిక మేమో!
కనఁ డిప్పుడె మైహికంబుఁ గనుఁ గనులారన్ 16

క. ముందుగ నిందొక దానినిఁ
బొందిన, నాముందు, నందుఁ బొందఁగ దగుఁ, గా
నం దగ నే యత్నించెద
సందేహముఁ దీర్చుకొనెద, సల్పెద దీక్షన్ 17

క. అంచున్ మది నెదియో! యో
చించుచు నొక్కించు కంత చెటచెటఁ జని తాఁ
గాంచె మనోహర ఫలపు
ష్పాంచిత గురు తరు లతా విహారము వనమున్ 18

క. అందుఁగల వివిధ చిత్రము
లుం దిలకించుచుఁ బోయిపోయి లోనొక చోటన్
బొందికఁ గూర్చుండంగా
సుందరి యొక నాతి వచ్చి చూచె యతీశున్ 19

క. దండ కమండలు మండిత!
చండాంశు సమాన తేజ ! సారవిచారా!
పండిత! ఖండిత భవ ! బ్రం
హ్మం డాఉఘటన ఘటనా సమర్థ! యతీశా ! 20

క. వందన మిదిగో గైకొను
మిందులకున్ తమరిరాక యెంతయు సుకృతం
బెందులకో! దయచేసితి
రెందాఁక ప్రయాణ మడిగి యెఱుగన్ దగునే ? 21

క. అని భక్తి నాతి పల్కిన
వినయంబునుఁ జూచి మెచ్చి వెలదిరో ! మార్గం
బునఁ జనుచు నుండి వచ్చితిఁ,
జనవలె నొకచోటఁ గార్యసాధన కొఱకై 22

క. మా నారాయణ సంస్కృతు
లే నిను రక్షించుఁ గాత యెవరిది ? యీ యు
ద్యానవనము? కడు రమ్యము
దీనిన్ నీ వుంట కేమి తెలుపుము కతమున్ 23

క. అనియన యతి కను నతివయు
వినియుందురు ముందు తాము వినయధ్వజుఁడన్
ఘనమతి జనపతి, నాతని
వనమిది, తనయకు విహారవనముగ నుండున్ 24

క. ఆయమ యదిగో అచ్చట
నే యున్నది యామె వెంట నేమును గూడన్
ఈ యుద్యాన వనానికిఁ
బాయక వత్తుము విహార భావము తోడన్ 25

క. తమవంటి వారు వచ్చిన
సమయంబునుఁ జూచి యాజ్ఞ సలుపఁగ నన్నా
యమ నియమించెను, గావునఁ
దయ యాజ్ఞ నొనర్ప వలయుఁ దయతోఁ జెపుడా 26

క. అనవుడు యతి వరుఁ డించుక
మనమున యోచించి పలికె, మానిని ! మాకీ
వనమున నుపచారములే
యనవసరము లైన నొక్క టడిగెదఁ జెపుమా! 27

క. అమ్మాయి ! నీ సదుక్తుల
సమ్మోదముఁ గలిగె మాకుఁ జక్కని వినయం
బిమ్మెయిఁ జూపితి, నీ చెలి
నమ్మా! నొకసారి చూడ నగునే? మాకున్ 28

క. యాదృచ్ఛి కాఱగ తాఱతిథు
లాదరణము తోడ నామె కాశీర్వాదం
బీఁ దలఁచెద, రభ్యంతర
మే దేనియు లేని యెడల నిటఁ బిలు మమ్మా! 29

చ. అని యతి పల్క బాల వినయానతయై తమ యాజ్ఞ యంచు వే
జని చెలి వెంటఁ బెట్టుకొని చక్కఁగ వచ్చి యతీంద్ర! మా సఖీ
జన మిదె మ్రొక్కు, ధన్య యగు చందము దీవన సేయుఁడీమెకై
జనపతి కష్టముల్ దొలఁగఁ జాలక యున్నవి నేటి దాఁకయున్ 30

చ. అని వచియించి రాజసుత నయ్యతి మ్రొక్కు మటంచుఁ బంప నా
జనపతి పుత్రియున్ వినయ సంభ్రమ భక్తులు మూర్తిఁ దాల్చి నాఁ
దన కరపల్లవంబుల నుదాత్త గుణోజ్వల తాపసోత్త మా
రుణ పదపద్మముల్ దవిలి మ్రొక్కె, న దెంతటి భక్తి యోగమో 31

ఉ. అంత యతీంద్రుఁ డామె శిర మందున హస్తము సాచి వత్స! నీ
చింతిత మింతలోఁ ద్వరగ సిద్ధిలు, వర్ధిలుగాక నీ సిరుల్,
వింతలు పుట్టు, వాని కవి వేకము నందకు, మట్టివేళనే
కాంతములో నిదే భరణిఁ గైకొని చూడుము భావ మయ్యెడిన్ 32

క. అని పల్కి లేపి యొక భర
ణినిఁ జేతి కొసఁగి శుభాంగి! నీ కొకతెకె దీ
నినిఁ గాంచెడు నధికారం
బనవద్య మనన్య సాధ్య మది మేమన్నన్ 33

చ. ఇది యతి ముఖ్యుఁడో నరప తీంద్రుఁడొ! లేక సమస్త రాజ్య సం
పదఁ దులఁ దూగఁ గల్గు నవ పల్లవ పాణి సతీమ తల్లి యో!
సుదతి! గ్రహింపనౌఁ బరుల చూడ్కుల కందదు మ ద్గురుండు పెం
పొదవఁగ నిచ్చె నాకుఁ బ్రియ మొప్పగ నిచ్చితి నీకు నేనుర్వ 34

ఉ. దీని ప్రభావ మద్భుత మదృష్ట ఫలప్రద మందు మంచియే
కానగు నేనిఁ గుంకుమము కస్తురి పువ్వులుఁ గాన వచ్చుఁ గీ
డైనచొ! బొగ్గులుం జమురు నగ్గియుఁ దోఁచును, దీని శాంతికై
ధ్యానయుతంబుగా మనువు నందు లిఖించియె యుండుఁ జక్కఁగన్ 35

చ. అది పఠియింపగా నిడుము లన్నియుఁ బాయు మనోరథంబులున్
గుదురుగఁ గూడి వచ్చు, నిది గోప్యము, దీనిని బైలు సేయరా
దిది యతి కేల ? నీ కయిన నెంతయు నొప్పు నటంచు నిచ్చితిన్
హృదయము లోన నుంచుకొను మియ్యది కష్టపు వేళఁ జూడుమీ! 36

తే. కారణము లేని వాత్సల్య కారణమున
నిచ్చి నాఁడను శుభ మంచుఁ బుచ్చి కొనుము
భద్ర! నీ భావి ఫలమెల్ల బాగఁ దెలుపు
హరి హరాదుల కేనియు నబ్బ దెందు 37

క. అని చెప్పఁ బ్రసాదం బని
కనుదామర లద్దుగొనుచు గ్రహియించె మహా
ధన మబ్బిన పేద వలెన్
మనమున నుప్పొంగి మ్రొక్కె మఱి యతి పదముల్ 38

తే. అంత యతి వర్యుఁ డొక శాటి నామెచెలికి
నొసఁగి సౌ భాగ్యవతి గమ్మ ! యువిద ! యనుచు
నాదరమ్మున దీవించి యవల నృపుని
కొలువు కూటంబు దర్శింపఁ గుతుక పడియె 39

తే. అంతలో నంది పుచ్చుకొన్నట్లు రాజ
తనయ కనుసన్నఁ జెలి పల్కెఁ దాపసేంద్ర !
ధన్యులము నేము మీ మాట కన్య మున్నె?
సిద్ధ వాకు లవెన్న నబద్ధ మగునె! 40

సీ. మా రాజ చంద్రుండు మీరాకఁ బొడఁ గాంచి
యెదురగా నర్ఘ్యంబు నీయ వచ్చు
మారాణి మీ పాద నీరేజ యుగళంబు
పాద్యోదకంబులం భక్తిఁ బోయి
మా మంత్రి పరివార మా మంత్రణము సేయు
సామంత లోకంబు సాగి మ్రొక్కు
మా భట ప్రకరంబు మార్గంబుఁ జూపించుఁ
బండి తావళి యొక ప్రక్క నిలుచు

తే. వంది మాగధ వినుతులు వాద్యతతులు
మాఱు మ్రోగంగఁ బ్రజ లెల్లఁ జేరి కొలువ
దేవ! మారాజధాని కేతేర వలయు
నందు మా చెలి ప్రార్థించు యతి వరేణ్య 41

తే. యతులఁ జూచిన మాఱేని కమిత భక్తి
వీత రాగులు వారంచు విజ్ఞు లనుచు
వారి కడ్డంబు సేయంగ వల దటంచు
ద్వార పాలుర కొక్కటే యానఁ జేసె 42

క. అంతః పురమున కైనన్
సొంతము తా నుండు నట్టి చోటున కైనన్
శాంతులు యతులగు వా ర
భ్యంతర మేమియును లేక యరుగఁగ వచ్చున్ 43

మ. అని కోరన్ యతి శేఖరుండు సరియే యంచున్ శిరం బూచి తాఁ
జనె నారాయణ యంచు ద్రోవ నడచెన్ స్వాతంబు యత్నేకృతే
యను వాక్యార్థము తొందరింప నర పాలాగారమున్ జేరఁ బో
యెను, రా జాగ్రణి మానస స్థితిఁ బరీక్షింపంగ నుద్యుక్తుఁడై 44

శా. పోవం బోవఁ బురోంగణంబున గిరి స్ఫూర్తిన్ గరి వ్రాతముల్
తీవిన్ హస్తము లెత్తి స్వాగతము గొండే యన్నటుల్ గన్పడెన్
బూవుం దీవెలు పూలవానఁ గురియన్ బుష్పోళ్ళు పై వ్రాల బూ
పాళ వాస ప్రథమంపు కక్ష్య గడచెన్ యత్యుత్తముండత్తరిన్ 45

ఆ. ద్వార పాలు రెల్ల దండాలు వెట్టంగ
నడ్డమేమి లేక యవలఁ జనఁగ
నశ్వ రత్న జాల మాశ్చర్య ముం గొల్పె
నిక్కు చెవుల తీవి నిర్గమింప 46

మ. సకిలింతల్ విను వీధి ముట్టెను శ్రుతి స్థాయి స్వర త్రిపుటి
ప్రకట స్వాగత భాషి కేసర మిళ ద్రమ్యోద్గళోద్యన్ముఖ
స్వకపో లాద్భుత కల్పనా భ్రమిత విశ్వఖ్యాత గాంభీర్య గా
న కళా నైపుణి ధైవతం బను మహానాదంబు హేషార్భటిన్ 47

తే. తమ హయగ్రీవతన్ గాంచి తమక ముంచి
దేవ యోనులు దాల్చిరో! గ్రీవ మట్లు
మఱియుఁ దమచెంత గాంధర్వ మహిత కళలఁ
గనుట గంధర్వు లను పేరుఁ గాంచి రొక్కొ! 48

మ. అనుచున్ బుచ్చము లూపు వాజి నిచయం బల్లల్లనం జూచుచున్
జని తత్కృత్య నతిక్రమించి కనియెన్ క్ష్మాభృద్భటావసమున్
ఘన బాహాబల శక్తి మాస ఋతు పక్ష ప్రేక్ష్య శిక్షా, గురు
ప్రణి పాతాదిక చిహ్నవాసిత కర ప్రావీణ్య విన్యాసోల్లాసమున్ 49

క. ఆజాను బాహు లందరు
భూ జానికి భుజము లగుచుఁ బుణ్యాశ్రయులై
జాడ్యము లేకుండఁగ
నీ జగమున నిలిచినార లెంతటి వారో! 50

మ. భటవర్గంబు యతీంద్రుఁ గాంచి నిభృత ప్రజ్ఞా విశేష స్ఫుర
త్పటు భక్త్యంజలి దండవ త్ప్రణ మన ప్రత్యక్ష సాష్టాంగులై
అటు లుండన్ గనులార నారయుచు కక్ష్యన్ దాటి పోవఁగ జెం
గట దేవాలయ రాజిఁగాంచె యతి భృంగా రాగ్రహారం బనన్ 51

చ. హరి హర మూర్తులందు దరహాస ముఖంబుల భక్త కోటికిన్
వరముల నిచ్చువారొ! యన వర్తిలు చుండిరి త ద్విలాసముల్
గురుతర గోపురంబులను గోడల బంగరు శిల్ప మొప్పు న
చ్చెరు వుదయించు విప్రతతిఁ జేసెడి పూజల భక్తి పూరమున్ 52

ఉ. అక్రమ పద్ధతుల్ గనము హాయిగ వేదపు స్వస్తినాదముల్
ప్రక్రియ లారితేరిన సపర్యలు ఘుంఘువ లాడు ధూప దీ
ప క్రియలుఁ నివేదన ఉపక్రమమూణ సుమంత్ర పుష్పముల్
ప్రక్రమ భంగ రాహితి పరాత్పరు సేవలు భక్తి మూర్ఛనల్ 53

మ. వినుచుఁ గాంచుచు వచ్చుచున్న యతికిఁ విప్రాళి సాష్టాంగ వం
దనముల్ జేసెను వేదమంత్రములతో తత్పూజలఁ జేకొనెఁ
జనియెఁ మెల్లగ రాజధాని నగరుఁ సంకల్ప సిద్ధ్యర్థియై
పని సాధించు నతండు నిల్చునె ? సుఖభ్రాంతాత్ముఁడై యొక్క చోఁ

చ. చని చని రాచబాట ఘనసారము నత్తరు మంచి గంధ మిం
పౌనర కలాపిఁ జల్లినఁ దదుద్గీత సౌరభ వ్రాత పోతముల్
మనసున కింపుఁ గూర్పఁగఁ గ్రమ క్రమ దృశ్య విలోకనంబులఁ
జనపతి గేహముఁ గనెఁ బ్రశాంత మనోహర భావ దృశ్యముఁ 55

ఉ. అంత యతీంద్రు వార్త వినయధ్వజ భూపతిఁ జేరె నంత నా
వంతయు నాలసింపక చివాలున లేచి యమూల్య హైమ పా
త్రాంతర సీమ పూవు లిడి యర్ఘ్యము పాద్యము సిద్ధపెట్టిఁ ద
త్కాంత యనంత భక్తి యతికై పతి పూజకుఁ బోవుచుండగఁ 56

చ. సచివ పురోహితాఽఽదులును సత్కవి పండిత వంది మాగధ
ప్రచయము వాద్యగాంద్రు పరివారము సర్వము సర్వ సిద్ధులై
యుచిత వినీత విశేషముల మత్సుకతం బరతెంచి రుద్భటాల్
ప్రచుర విశిష్ట శిక్షణ, బిరాన బరాబరి దీరె రారయఁ 57

ఉ. స్వాగత పట్టికంబులనుఁ బట్టిరి కొందఱు, వాద్యఘోషముల్
సాగెను, వంది మాగధుల సన్నుతి హెచ్చెను సత్కవీశ్వరుల్
స్వాగత పద్యముల్ చదువ సాగిరి, వైదిక వేద నాదముల్
వాగులు వారె నిట్లు పరివారముతో జనె నా నరేంద్రుఁడుఁ 58

క. ఇది యొక క్షణ మాత్రములోఁ
బోదవెను, సంకల్ప సిద్ధి, భూపాలున, క
య్యది యెటు సిద్ధించెనొ! తో
పదు, తపమో! నవ్య యంత్ర సాహిత్యంబో! 59

క. ఏవం విధమగు పరివా
రావృతుఁడై యర్ఘ్యపాత్ర నంజలి గొని యా
భూవరుఁ డరుదేరెను, పతి
కావల సతియు నడచె పాద్యమంజలి గొనుచున్ 60

క. కనఁగన శృత్యర్థంబును
ననుగమియించెడు స్మృతియన నాయమ మిగులన్
దనరెను షట్ పింజలు దీ
ర్చిన సుమ పుట్టము ధరించు శ్రీదేవి వలెన్ 61

చ. అనఘుఁడు రాజచంద్రుఁ డిటు లాయతి ముఖ్యుని కాభిముఖ్యుఁడై
వినయ వినమ్రుఁడై యుచిత వేషముతోఁ దగ నేగు దెంచి వం
దనములు - పూజలున్ విధి విధానముగా నొనరించి గారవిం
చిన యతి వర్యుఁడా విభుని శీలము భక్తియు నాత్మమెచ్చుచున్ 62

మ. జగ దీశుండగు విష్ణు నంశమున, సాక్షాత్సత్వ సంపన్నుఁడై
తగు నీతండు, ప్రభుత్వ మేల జగతిన్ ధర్మంబు విస్తారమౌ
భగవ ద్భక్తియు హెచ్చు లోకములకున్ భద్రంబు చేఁగూరు భా
వ గభీరుం డగధీర వీరవరుఁడన్ భావంబు నాకయ్యెడున్ 63

చ. అని తలపోయు నాయతి కహర్పతి తేజుఁడు రాజశేఖరుం
డను మహనీయ దివ్య మహిమాన్విత! వీతరాగ! త్యా
గి నికరముఖ్య! విజ్ఞుఁడవు కేవల మిందుల కేగుఁ దెంచుటల్
నను కృతకృత్యుఁ జేయుటకె నాదగు జన్మము ధన్యమయ్యెడున్ 64

క. దయసేయుఁజు, శిబి కోపరి
దయసేయుఁడు మా గృహంబు ధన్యంబు యతీం
ద్ర! యనుచు నాయతి పల్లకి
స్వయముగఁ గూర్చుండఁ జేసె జయ జయ యనుచున్ 65

క. తా నొక ప్రక్కన నడచుచుఁ
జే నొక వింజామరంబుఁ జేకొని విసరెన్
జ్ఞానికిఁ జేసిన సేవలె
మానవునకు భుక్తి ముక్తి మార్గం బనుచున్ 66

తే. ఇట్లు తోడ్కొని వచ్చి యతీంద్రుఁ గనక
పీఠ మందు భక్తుఁ డుపవిష్టుఁ జేసి
వినయ భూపతి పూజించె విభవ రీతి
భక్తు డొనరించు పూజకుం పాటి కలదె ? 67

క. శిష్టాచారము చొప్పున
నిష్టాన్నము భిక్షఁ గొని యతీంద్రుడు తృప్తిన్
మృష్టత వడసెను మఖమున
జుష్టము గొను హవ్యవాహు శోభల బొలిచెన్ 68

ఆ. పరమ హంస యైన బ్రహ్మ వి త్సన్యాసి
బ్రహ్మ తేజ మొప్పఁ బలికె నిట్లు
రాజ! యేమి కోఱత తేజస్వి వోయి నీ
కేమి యవసరంబు భూమహేశ ! 69

క. రా మెప్పుడు నీ చోటికి
మే మెప్పుడు! బోము రాజ మిత్రుల కడకున్
ఏమో వచ్చితి మిందుల
కే మా యుపదేశ మొకటి నిత్తుము గొమ్మా! 70

తే. అనుచు యత్నేకృతే యది యనెడు సూక్తి
నర్థయుక్తంబుగాఁ జెప్ప యతివరేణ్యుఁ
డంత నా రాజచంద్రుండు నంజలి ఘటి
యించి ప్రార్థించెఁ దన కోర్కె నిట్లు యతిని 71

ఆ. పరమహంస! తమ యపార కృపా కటా
క్షంబ కారణంబ కలిగెఁ గాదె
పూర్వ జన్మ పుణ్య పూర్ణ ఫలంబె కా
కన్య మగునె! మాకు యతి వరేణ్య! 72

క. ఉపదేశ మిచ్చినారలు
కృపతో గురువర్య! తమరు కింకరులము మా
యుపచర్యల సహియుంచుచు
నుపచర్యలఁ గొంచు నింద యుండగ వలయున్ 73

మ. ఇదిగో! రాజ్యము వీరె మంత్రు, లితడే యీ మీ సదాసేవకుం
డిదిగో! యంతి పురంబు, పుత్రి యిదిగో, యీ సర్వముల్ మీయదే
యెది మీ సేవకు యోగ్య మాజ్ఞ యిడుడీ యిత్తున్ మనః ప్రీతిగన్
విదితాత్మా! గురుదక్షిణన్ గొనదగున్ విశ్వాస ముంచం దగున్ 74

క. ఊరక రారు మహాత్ములు
కోరిన దయసేయ రెందుఁ, గొఱతలుఁ గలవే ?
తారక మూర్తులు ధన్యులు
మీరిటు లరుదెంచుటన్న మేలును గాదే! 75

క. యతి నియతుల కసిధారా
వ్రత వితతులు సాటిరావు బ్రహ్మ
ర్పిత మతులు పతిత పావను
లు తపస్వులు వారికేమి లోపము లుండున్ 76

మ. అని ప్రార్థించిన రాజ శేఖరున కయ్యత్యుత్తముం డేమియున్
తన భావంబు నొసంగఁ డేమి కతమో తద్భావ భావిక్రియా
మననంబో! యది యోగమో! వినయమో! మౌనంబో! యింకేమొ ! యం
త నృపా లాగ్రణి దోసిలొగ్గి మహితాత్మా! మమ్ము మన్నింపరే ! 77

చ. పలికిన పల్కులందుఁ జెడుఁ బల్కితి నేమొ! యతీంద్ర! మీ యెడన్
గలిగిన భక్తి పెంపున నకల్మష చిత్తుఁడనై వచించితిన్
తెలియని వున్నఁ దెల్పుడు విధేయుని కోరిక రిత్తఁ బుచ్చగాఁ
బలుకకుఁ డేమి కావలె నభాగ్యుఁడ నయ్యెద నాన లేమికిన్ 78

చ. మఠములు గట్ట మందురొకొ మాన్యము లిమ్మని యాన సేతురో!
శరులనుఁ బార ద్రోలుమని సమ్మతి నిత్తురొ! జాలి మీరి క
ర్మరులకుఁ గీడుసేయగల రక్కసి మూకలఁ ద్రుంప మందురో!
కఠినము లైన వేని కవకాశము లిత్తురొ! యానతీయరే! 79

చ. విడువదు మీ ఋణంబు, తగవే? గురుదక్షిణ లొప్పఁజెప్పగా
కడఁగతి నెంతకేని యతి కాదని మీరన రాదు కోరుఁడె
క్కడ నెది సేయఁ బంచెద రొకానొక టేనియు నాన తీయరే?
యడిగిన వేవి యైన మహితాత్మ! చలం బిడఁ జేసి తీరుదున్ 80

చ. అని యిటు లా యతీంద్రు బహు ళాదర భక్తి వినమ్ర మూర్తియై
జనపతి వేడు కొన్న నిది చాలును చెల్లవు మాకు కోరికల్
ధనములు మేడలుఁ బ్రభుత తథ్యము మా కవి యేల? పో
దును సెలవే ? యనన్ యతి కతుష్ట మనంబున భూపుఁడిట్లనెన్ 81

ఉ. ఎంత యభాగ్య మూర్తినో! యతీశ్వర! పూజ్యులరైన తాము మా
కింతయు నాన సేయ రోక టేనియుఁ గోర రదెంత పాపమో!
చింత మనంబునం గుముల జేయుచు నున్నది పుణ్య తత్పరుల్
పొంతకుఁ జేర నిత్తురె? ప్రభూత దయామయ! పాపవిత్తముల్ 82

క. వలదని తా మన్నను తమ
వలనన నుపదిష్టమైన వాక్యమె మమ్మున్
బలిమినిఁ బలికించెడుఁ గే
వలమది ఋషి వాక్కు వ్యర్థతఁ జనునే 83

క. నా కోరిక కడుఁ జిన్నది
మీ కరుణయె లెస్స మాకు మేలు భజింపన్
కాకుండిన మా పాపము!
ప్రాకటముగఁ బలిసి పోవుఁ బతితుఁడ నగుదున్ 84

క. తప్పదు నా కాజ్ఞ నిడక
యెప్పుడు నా కంతపాటి దేర్పడుఁ బుణ్యం
బెప్పుడు ధన్యతఁ గాంతును
చెప్పుడు మహనీయ! యతులు సిద్ధులుఁ గారే! 85

చ. యతు లన వీతరాగులు ప్రయత్నము తోడను వారి పాదముల్
సతతము సేవ సేయు నెడ సద్గతిఁ గాంచును గేస్తు డట్టిచో
పిత యొనరించు కొందునె! వివేక విహీనుఁడ నేన యౌదునే ?
కృత మింక మీక యర్పితము క్షీరమొ నీరమొ! దేన ముంతురో! 86

ఉ. నా విని భూవరా ! వలదు నా వినవైతివి వీడ వెంతకున్
త్రోవఁ జనంగ నీవు నిను ద్రోసి చనం గుణ మేమి నాకు నే
మో వచియించితిన్ దలపు లుండక పోవునె ? మోక్ష కామికే
నీ వలనన్ ఫలించునె ? మ దీప్సిత మియ్యెడ పొర మందునే ? 87

క. కడు దొడ్డది నా కోరిక
యొడయడ! యొడఁ గూర్తువేని యుత్సాహివి గ
మ్మెడ నెడ నుడువులు దప్పిన
చెడు పగు నా మాట వినుమ! చెప్పితి నింతన్ 88

తే. మదుపదేశ మాహాత్మ్యమ్మున్ మది దలంపు
మిమ్ము మాట తప్పఁ దగదు సుమ్ము యట్ల
కాద నందువ యేని నీ కేది లేదు
రాజ! వింటివే? యే మందు వోజ కలదె ? 89

క. దానాఽదాన ద్వితయము
నే నాడునుఁ బాత్ర మెఱిఁగియే చేయవలెన్
కానన్ నీచేఁ గాదిది
యే నిఁక మఱి యెక్కు చోటి కేఁగెద నధిపా! 90

తే. ఏమి నీ యిష్ట ? మిక మీద నింతదాక
తెలిపి చెప్పితి భూవరా ! తెలుపు మనుచు
యతి వరుండు వచింప నా యధిపుఁడనియె
స్వామి! నేఁడుగా నా జన్మ సార్థకంబు 91

త. ఆడి తప్పుట మా యింట నసలె లేదు
పంచ భూతాలు సాక్షిగాఁ బలుకు వాఁడఁ
తిరుగ దీ నాల్క తమ యాన తీపుగొనక
యాన తిండని ప్రార్థించ యతి వచించె 92

క. న హి మే కశ్చిత్కామ్యో
రహి తోఽస్మి భవేన కర్మ రాహిత్యేణ
స్పృహయామిః వివాహార్థం
దుహితారం దేహి మాస్తు దురభిప్రాయః 93

క. గతిమాలిన యతినై యిటు
మతిఁ జేసితి నీ సుపుత్రి మా కిడు స్పృహ చే
సితిఁ గౌతుక విధికై చె
ప్పితిఁ గద! మునుముందె కోర్కె పెద్దది యనుచున్ 94

క. ఏ మందువు? రా ముందుకు
కామందు వవు నీవు, మాట కాదనవు కదా ?
శ్రీమంతుల మాటలలో
నే మాత్రము నిలుకుఁ గలదో యెఱుగగ వలయుఁ 95

మ. ఇది నా కోరిక దీనికై కడగి యిందేతెంచితిఁ నీవునా
మది సంతోషము సేయు మన్న నృపుడుఁ మంత్రుల్ సభాసభ్యులుఁ
మది నీరై జడులై స్పృహాపగతులై క్ష్మామండలీ సంస్థితిఁ
బొదలం గల్గిరొ! లేరొ తార లెరుగం బోరైరి చిత్రక్రియఁ 96

ఉ. ఒక్క మహూర్త కాల మిటు లుండుట సంభవ మయ్యె నంత నొ
క్కొక్కరుఁ దేరి తేరి తమ యూహల నన్నిటి వెల్ల చూపులఁ
ద్రిక్కగఁ దెల్పఁ బూని రొక తెన్నుకు రాదది యిట్లొకళ్ళొక
ళ్ళుక్కజ మందు చందు వివిదార్థ పరంపర రేపి రయ్యెడఁ 97

క. ఇది యేమి కోర్కె యింతటి
ముదుసలి సన్యాసి పెండ్లి మోజున రాజుఁ
సుదతిం బుత్రిక నిమ్మని
పదపడి యడుగంగఁ దనకు భావ్యమె యనుచుఁ 98

క. యతి కేల పెండ్లి ? యిందొక
యతిశయ మేదేని యుండ నయ్యెడు, నరయఁ
పతి నిట్లు పరీక్షింపఁగ
జతపడు సంఘటన మేమొ! జరిగె నటంచుఁ 99

క. జనపతి కిష్టార్థంబుల
నొనఁ గూర్పఁగ వచ్చినట్టి యుత్తముఁ డెవఁడో!
తనయం దాయమ భారము
ననువుగ ధరియించు చుండె నౌరా! యనుచుఁ 100

క. పలువుర యువరా ట్పుత్రుల
కలుముల లెక్కింప దాయె కాలము గడపెఁ
జలజాక్షి రా కుమారికి
కలిగెనె సన్యాసి పెండ్లి కాలం బనుచుఁ 101

క. ప్రభు విప్రుఁ డేమి యొనర్చునో
సభ యంతయు గోల రేగ సమ్మతిఁ గొనునో?
రభసయె చెందునొ! మంత్రుల
యభిమతములఁ గొనునొ యేమిఁ యాడునొ యనుచున్ 102

శా. ఈ రీతిన్ సభ యింతయున్ గలకలంబేర్పడ్డ మంత్రుల్ విభున్
బారం జూచిరి, రాజు వారిఁ గనియెన్, భావైక్య సంధాక్రియన్
దా రన్యోన్యము చక్షురాది కరణ ద్వారా మహా పండితుల్
ధీరుల్ గావున నూహ దెల్పిరి విభున్ ధీయుక్తి మాట్లాడఁగన్ 103

ఉ. అంతట భూ వరుండనియె నంజలిఁ గూర్చి, మహాత్మ! నీర వ
మ్మింత యనుగ్రహించితి రీదే పదివేలు మదాత్మ జాత నీ
వంతున కుంతు నింత యొక భారము తగ్గినఁ దగ్గగాక మా
కింతకుఁ బెండ్లికామి కొకటే యొక టడ్డము, దానిఁ గూర్పరే! 105

మ. వినుమా! మా కుల సద్ధతిన్ వరుఁడు తాఁ బెండ్లాడ రా నెంచుచో
ఘన జీవన్మణు లేడు మాన్కలకు పైఁగా తేవలెన్, వానినే
మును పూజింప వలెన్ వధూమణి తలన్ ముగ్గం దలంబ్రాలుగా
నొనరింపన్ వలె వంశపద్ధతిది మీ కొప్పైన మా కొప్పగున్ 105

శా. సందేహం బిసుమంత లేదు, తమ కిష్టం బేని సంసిద్ధులై
పొం దొప్పన్ గడియించి తెండు మణులన్ పుత్రీ మహా భారమున్
గ్రిందం దింపుము దీనికైపుడు శ్రమోద్రేకంబు శాంతింపదే
మందున్ జింతలు దీరుగాక మహనీయ్యానన్ బ్రసాదింపరే ! 106

తే. అనుడు నప్పురి వ్రాజకుం డాత్మఁ బొంగి
తలఁచె యత్నే కృతే యను పలుకు మహిమ
అడిగి నాడను దుర్ఘటం బడిగి నాడ
నట్ల వారును బల్కిరే యత్న పడెద 107

చ. అని మదిలోఁ దలచి యధిపా! సరియేకద! పోయివత్తు నీ
రనునది ధర్మ్యమైనను ప్రయత్నము చేసెద నొక్కయేడు హ
ద్దొనరగ నిమ్ము, పిమ్మట యథోచిత రీతిని నాచరించు కో
మ్మని వచియించి యా యతి తనంతట తాఁజనె నెందునేనియున్ 108

క. అంతట నంతః పురమం
దంతటఁ గాంతా నిరంత రాక్రందనముల్
ఎంత దురంతములుం బలు
చింతలు నెంతెంత వేనిఁ జెలరేగె సుమా! 109

ఉ. ఊరు నుగంబు నేకమయి, యొక్క విధంబున ఘోరు ఘోరు మం
చేరులు బారు నశ్రువుల, నెఱ్ఱగఁ గన్నులు వాచిపోవ నా
కారముఁ దాల్చి శోకమనఁగా నట నాయతికిన్ నృపాత్మజుల్
గూరుతుః రన్న మాట విని కుందెను తత్ప్రజ యెంత భ్రాంతియో 110

క. రానీ యతి గతి చెప్పెద
మీఁ నీతియ యతుల కనుచు నే మడిగెద మెం
దేనిం బోనీ విడువక
ఖానీ గావించి దండిఁ గూర్తుము దండిన్ 111

క. మా యమ్మ రా కుమారికి
ఖాయము పతి చక్రవర్తి కావలెఁ గానీ
యీ యతి యేడ ఘటించెనో
మాయా మయ మీ జగ మవమానము మాకున్ 112

క. అజ్ఞులు, విజ్ఞులు, నిట్లని
ప్రజ్ఞల జజ్ఞాస పడుచు పలుకుచు వగవన్
ప్రజ్ఞావతి తా నెంతటి
తజ్ఞయొ నగుమోము కళలఁ దద్దయు నొప్పెన్ 113

చ. ప్రతిభను జూచి నవ్వి జెలి! భవ్య యతీంద్రుని భావ మేమి? నన్
వితా మొనరించునే ? యతడు, వెఱ్ఱి యతండఁటె? పెండ్లి సేయఁగా
విత మెఱిగింపఁ గావలసి వేడమి వచ్చిన పుణ్యమూర్తి, కా
మిత ఫలదాత, యాత డనుమేయుడె? యాశ్రమ (పాత) పైన్య మందుగన్ 114

తే. నిన్న నుద్యాన వనములో నన్నుఁ బిలిచి
రాణి వయ్యెద వని కదా తాన పలికెఁ
తాను జేసిన దీవన తథ్యమేని
యీ తలంపుల కవకాశ మింతఁ గలదే ? 115

ఉ. నిన్నటి నుండి నా యెడమ నేత్రము స్పందన మందుచున్న, దీ
నన్ను మనస్థిరంబుగ మనందగు నంచని హెచ్చరింపుఁగా
నున్నది నెమ్మదిఁ గలుష మొందదు, కౌతుక మౌనిఁ కేటికో!
యిన్ని తెఱంగులం బలుకు లిన్ని విధంబులఁ బొక్కి పోవుటల్ 116

క. కాఁ దగునది కానే యగుఁ
గాఁ దగనిది కాదు విధినిఁ గాదన తరమే
మీదట దైవా ధీనము
నాదగు సౌభాగ్య గరిమ నమ్మితిఁ జెలియా! 117

క. చెడుపదు దైవం బెన్నడు
దుడుకుగ దైవంబు గురునిఁ దూఱుట తగవే ?
ఒడుదుడుకు లవేటికి నా
కిడు నా శుభదాత యతి యనేక శుభంబుల్ 118

క. చెలియా! మా తలి దండ్రులు
బలుచింతల పాలు గాక బ్రతుకుదు రొక్కో!
విలపింపం బనిలేదనిఁ
పలుకుమ! పలుమారు నాదు పలుకుగఁ బ్రతిభా! 119

మ. అనుచుం బల్కిన రాకుమారి విధ మత్యాశ్చర్యమై తోప నె
వ్వనికిం లేని మహా క్షమా సుగుణ సంపత్తిం బ్రశంసించి మీ
చిన నేర్పుల్ జని రాజ దంపతుల కా చిన్నారి పుత్రీ మన
స్సును దెల్పెన్ బ్రతిభాకుమారి తనయా శోకంబు వారించుచున్ 120

ఉ. వారును ధీరు లాతనయ భావ గభీరత తోడుగాగ వి
స్తార ముదంబునం బొదల సాగిరి, కాని ప్రజాళి ధోరణుల్
పారము లేని వయ్యె, నను భావము లందరి కర్థమౌనె! ని
ష్కారణ మేటికో! వగపు, కాగల కార్యము కాక మానునే ? 121

## ద్వితీయాశ్వాసము

చ. అట యతి యత్నుకృ ద్వచన మాత్మ నలంపఁగఁ బోయి పోయి యె
చ్చట మన సొప్పుమిన్ నిలువఁ జాలక ''యెవ్వని నాశ్రయింతునా?
యెటుఁ గల? వా మణుల్, దెలియు టె'' ట్లని దీర్ఘ విచార భారుఁడై
యెట నెట వో చరించె నరుఁ డిష్టము తీరమి వెఱ్ఱి వాడగున్ 1



శా. ఆ రత్నాకరుఁ డబ్ధి, పొమ్మచట నీ యర్థ్యంబు సాధ్యంబగున్
ధీరాత్మా! త్వ దుపజ్ఞ మాన కిక సందేహంబ? నీ కేల సం
సార త్యాగివి, భోగి! సిద్ధుడవు దుస్సాధ్యము నీకున్నదె?
ధీరా! యచ్యుత ముక్తి డార! యను నా దేశంబు తోచెన్ మదిన్ 2

చ. ఇది భగవాను నాజ్ఞ, యిది యిప్పటి కార్యము దీని కోసమై
కదలెదఁ గాక, పట్టుదలఁగా పని చేసెద గాక యప్పటిన్
వదలుదునే యొకెత్తున నవారిగఁ జూచెద జీవరత్న సం
పద వదలింతుఁ గా కనుచు వార్ధికిఁ బోయె యతీంద్రుఁ డల్లనన్ 3

ఉ. ఆయతిచంద్రుఁ జూచి కలశాంబుధి యెంతయుం బొంగి పోయె న
త్యాయత వీచికా కరము లంబర వీధులఁ జూచి నిల్చి వ
త్సా యని పిల్చునో! యన మహత్తర నాదము లుప్పతిల్లె, నిం
కే యది యీ యడో! తనయు నిష్టముఁ దీర్చని తండ్రి యుండునే! 4

సీ. తట తరంగాఘాత తప తప నాదంబు తప మాచరింపుమన్ దలపుఁ దెలుప
హోరా హోరిన్ వచ్చు హోయను శబ్దంబు ప్రణవ
మోంకారంబు పలుకు మనఁగ
సురుచిర లావణ్య శోభా విలాసంబు బాడ బోన్నతి గన్న ఫణితి యనఁగ
జల జగ జ్జాల సంసారంపు సర్గంబు జీ నోద్ధారైక సిద్ధి యనఁగ

తే. పతిత పావను గంభీర భావ పూర్ణు
నర్ణవోదారుఁ దరిచేరి హుంకరించి
నడుము బిగియించి దండముం బుడమిఁ బాతి
యతి కమండలుతో నీరు నవనిఁ జల్లె 5

శా. ముంచన్ బోయును ముంచుఁ బోయు జలముల్ ముంచున్ ధరం బోయు ని
ట్లెంచన్ రాని దినాలు సాగినవి, యొక్కింతైన విశ్రాంతి నా
శించం డించుక డస్సి పోఁడు ముఖ లక్ష్మీ శోభఁ బాయండు వీ
క్షించం డన్యము నన్నపానములుఁ కాంక్షింపండొకే దీక్షగన్ 6

మ. ఇటు లా దీక్షితుఁ డేక నిష్ఠ స్థిరమై యేకాకి యై యుండనా
తట పల్లీజన వర్గముల్ పధిక సంతానంబులుం జూచి, యో
పటు దీక్షాపర! యేమి యీపని? భవత్ప్రారబ్ధ మిట్లేల ? యి
చ్చట నీ సాధ్య మదేమి? చెప్పఁ దగునేన్ సాధూత్తమా! చెప్పరే! 7



క. ఎండనక వాన యనక క
మండలుతో వనధి నీరు మహిఁ జల్లంగాఁ
గొండొక లాభము కల్గనె ?
యెండునె జడరాసి యేల యిట్లొనరింపన్ 8

ఉ. ఎన్ని దినాలు దీక్ష ? యిల నెవ్వనిఁ గాంచము నిన్నుఁ బోలె నీ
యున్నతి నెంచు వారెవ? రనూహ్యము నీ హృదయంబు కాన మా
కున్న తెలుంగుఁ దెల్పఁడన, నొక్కని కేనియుఁ బల్కఁడేమి కా
నున్నదొ! తోఁచ దెవ్వరి, కనూహ్యములే కద! యోగి కృత్యముల్ 9

చ. జలనిధు లింకునో ? యచల చంచల మందునో? వాయు యానముల్
నిలుచునొ? సూర్య చంద్ర గతి నిల్గునొ? రాలునొ తార కావళుల్
ఫెళఫెళ లేమి వచ్చిపడి భీతి నొసంగునొ? యింత తీవ్రతన్
సలిపెడు నీ తపస్వి యని సాత్త్విక వాక్కులు సాగె నంతటన్ 10

ఉ. కొందరు ధూర్త వంచకులు కోయని కూయుచు ఱాళ్ళు రువ్వ, వా
రందఱ కవ్వియే తిఱిగి యాయువు పట్లను తాకుచుండె, మూ
కం దన మేర్పడం దొడఁగె, కాని యతీంద్రుడు సేయ దేమి యా
చందముఁ జూచి చూచి భయ సంభ్రమఁ డయ్యెను సాగరుండటన్ 11

మ. పదునొక్కండు నెలల్ సనెన్ విసికి యీ పంతంబు మానం డితం
డిదమిత్థమ్మని చెప్పఁ డెవ్వరికి నిందేమో! రహస్యార్థ ము
న్నది, యీతండు మహాత్ముఁ డెవ్వఁడగు ? న న్నాశించినా డెద్దియో !
నదినే గూర్పక యున్న నన్ బున రగస్త్య ప్రక్రియన్ మాపడే 12

ఉ. నా సతి నాడు జహ్నుముని నాథుని యాచమనంబు పాటిదై
గాసిలి రూపు మాసి మఱి కల్గెను జాహ్నవి నాగ మాకుఁగా
మోసము లేవియో కలిసి మూగుచు నున్నవి, యాలపింపఁగా
దోసము సంభవించు నని దోచుచు నున్నది పల్కరించెదన్ 13

చ. అని సరి దీశుఁ డూహపడి యాయతి చెంతకు వృద్ధ విప్రుడై,
పని బడ వచ్చి మంత్ర విధి వందనముల్ పచరించి స్వామి! మీ
రన నిన తేజు లాత్మ భవహారులు త్యాగులు యోగులున్ దయా
వననిధి! మీకుఁ బోలునె ? సువర్ణము లబ్ధులు రత్నసంపదల్ 14

ఉ. దండికి దండివో! జలధి దండివొ! దండనముఁ బాలినావు, నీ
దండకు రావు దుండగుల దండులు, వచ్చినఁ జిచ్చుఁ జొచ్చిన
ట్లుండక మాన విట్టి యతి కుండెడి కోరిక యేమి? యిట్టి యు
ద్దండ తపః క్రియాఽచరణ తత్త్వము దెల్పుఁడ! భక్తి వేడెదన్ 15

ఉ. వినుము కొంత నీ కువక రింపఁగ నెంచితి సప్త సాగ రా
త్మను భవస్థుఁడన్ బడ బహుంకృతి నెంచితి లోతు గంటి నా
కానని లక్ష్మి లే, దమృత కౌస్తుభ కల్పము లన్ని గూడ ము
న్నేన యెఱుంగుదున్ గన ననేక యుగంబుల నాటివాఁడ నూ! 16

మ. అని యర్థించెడు వృద్ధ విప్రు వచనం బాలించి సన్యాసి యి
ట్లను విప్రోత్తమ! నాకు సాగరునితో నౌకార్య మొండున్న దిం
దనుకన్ యత్నము సల్పితిన్ తెలియ డాతం డింతకున్ మత్కృతం
బన వద్యంబ వచించితిన్ జనుమ నా యత్నం బుపాసించెదన్ 17

ఉ. నా విని వృద్ధ విప్రుఁడు మనంబున నుల్కుచు గద్గద స్వనం
బావహిలన్ బ్రభూ! మనివి యంచు మఱేమొ వచింపఁ బోవఁ బొ
మ్మోమ్మ వసుధామరా! పలుక కుండగ వచ్చిన త్రోవ బట్టుమా!
లేవవకాశముల్ బలుక లేవడి సాగరు పట్టుఁ జూచెదన్ 18

మ. కపిలాక్షీక్షణ భస్మరూప సగరుల్ గన్పింత్రు గా కంచు నా
వ్యపదిష్టుండు వచింప నప్పతి మహోవ్యగ్రాత్ముఁడై స్వామి! నే
న పయోరాశి సముద్రుఁడన్ యతివరేణ్యా! మున్నమ స్నారముల్
కృపతోఁ బాలన సేయుఁడే! యడుగుఁడే కృత్యంబు, చా లింతకున్ 19

తే. పరమ హంస! మీ దివ్య తత్త్వం బెరుంగ
వచ్చినాడను నన్నింక త్రచ్చ వలదు
తప్పు సైరించి క్షమియించి తత్త్వమొసఁగి
యుభయ తారక గతిఁ దెల్ప నోపుదీవు 20

మ. యతి నీ వేను గృహస్థుఁడన్ జడుఁడ బ్రహ్మానంద యోగీంద్ర! మా
సతు లెల్లం దను పాద పద్మముల సంస్పర్శన్ బవిత్రాత్ములై
క్షితిఁ బ్రఖ్యాతి వహించి నా రిపుడు మత్క్షేమార్థులై వచ్చి నా
రిత రాపేక్షలు నీకుఁ గల్గవు కదా! యెంతెంతలో నీదయల్ 21

తే. జన్మ మెత్తి నందుల కొక్కసారి యైన
యతిని పూజించి భిక్ష సేయంగలట్టి
భాగ్య మబ్బిన వాఁడెపో భవన భర్త
పతిత పావన! మా భిక్షఁ బడయు మయ్య! 22

తే. సఫల మగుగాక నా జన్మ, స్వామి! నీవు
కోరు నట్టిది యేమి? యే కొఱత లేదు
చేయ చున్నాడ సర్వ సంసిద్ధు నగుచు
ఆన తిమ్మని వేడిన యతి వచించె 23

ఉ. ఏన పయోధి నంటి పది యెట్లగు? నెవ్వఁడు విశ్వశించు నె
వ్వానికిఁ జెప్ప నేర్తు నను వంచన సేయగ వచ్చినావె కా
దేని నిజస్వరూపమున నేర్పడ కుందువె? పెద్ద బాపడా?
లేని మహత్త్వముల్ బలికి లేవడి వట్టకు పొమ్ము నావుడున్ 24

చ. వననిధి విశ్వరూప పరివర్తన మిందము కాంచు మంచు నా
క్షణమున వృద్ధ విప్రుఁడు ప్రకాండ జలౌఘ చర న్మహా మహా
మణి ఫణి నక్ర కర్కి ఝష మత్స్య తిమింగిల కచ్ఛపాది జం
త్వన వరత ప్రచార బహూళాస్పద వార్ధిగ మారె నయ్యెడన్ 25

ఉ. ఒక్కెడఁ బాల వెల్లి, పెరు గొక్కెడ, నొక్కెడ నిక్షు సాగరం
బొక్కెడ నుప్పు సంద్రము, మ రొక్కెడ సర్పిసురా సముద్ర మిం
కొక్కెడ నీటి సంద్రము నికొక్కెడ నొప్పగు సప్త సాగరుం
డొక్కెడు నాఁ గనంబడె మహోజ్వల, బాడబ తేజ మార్చుచున్ 26

ఉ. అంతము లే దగాధము వియత్తల మంతయు సప్తసాగరా
భ్యంతర మందిరంబ యన నంతట దానయి నిండి యుండె శ్రీ
కాంతుఁడు శేషశాయి యయి కౌస్తుభ రత్నము తోడ పోల్చని
శ్చింతతఁ లక్షి పుట్టెఁ బరిశిష్టము లెన్నియొ పుట్టె పై పయిన్ 27

ఉ. అండము లట్లు కొన్ని భువ నాంతర సీమలు దోచె నవ్వి బ్ర
హ్మాండము లేమొ! వానఁ దగు నట్లుగఁ గల్గిరి మాయఁ జేరి మా
ర్తాండ మరు ద్ధరాఽజ యమ దైవ గణంబులు శక్తి యుక్తులు
ద్దండ తరంబు లయ్యె ముని తండము, లుండెను ముందు ముందుగన్ 28

చ. విస, మమృతంబు, నచ్చరలు, విన్మొద, తీవుల చెట్లు, చందమా
మ, సిత గజంబు, వారుణి, సమర్థ తముండగు వెజ్జురాజు, నా
పసగల గుఱ్ఱముల్, కలిగి భాసిలు చున్నవి; భూమి వానిలో
కొస కొక నల్లపూస వలె గోచర మయ్యెను చూడఁ జూడఁ గన్ 29

చ. అదియును నేడు దీవులయి యందొక దీవిని నొక్కచోట నె
మ్మది స్వయ ముంటలో గనిన మాన్య యతీశుఁడు బ్రస్తుతింపఁగాఁ
బదపడి పూర్వ మట్లదయ భాస్కరతేజము తోప నిల్చి పెం
పొదవుచు నబ్ధి విప్రుఁడయి యుండిన చోటున నున్న యట్లుగన్ 30

ఉ. అంతట నాత్మ వేత్తలగు నా యుభయుల్ ప్రకృతి ప్రకాశులై
బ్రాంతులఁ బోలి యుండ నొక వాజి సమీపము జేరె వారి ను
ద్భ్రాంతులఁ జేసె చిత్రమిది, దాని స్వరూపము తాటి యాకు కా
దంతకుఁ బేల వం బసువు లప్పుడ వీడునొ యన్నటుండె సూ! 31

చ. సొలుగుచు, రెండు డొక్క లొక చోటికిఁ జేరిచి నోట జొల్లు వా
లలు గురియించుచున్ మొగ మిలాతలి వాల్చుచు, కంట నీటి కా
ల్వలు దొరలన్ ఖుర ప్రహతి వాసవ గర్జల ధిక్కరించగాన్
దొలుకరి మించు మించఁ గల తోక వెలార్చుచు వచ్చె నత్తరిన్ 32

ఉ. దానిని గాంచి ముగ్ధులయి తత్తడి చొప్పిది యేమి యంచు భా
వానఁ దలంచు చుండఁ దెలి వాహము డగ్గరి హేషఁ జేసెఁ బ్ర
జ్ఞాన నిధాను లాతురగ సంస్థిత శక్తిని నాకలించి రా
త్మాను భవాల మౌనులు హృదంతర సీమల గోచరింపవే? 33

ఉ. బాడబ తేజ మెట్టిదొ? ప్రపంచ మెఱుంగదు వాడినట్ల గాఁ
బాడయి నట్లుగా నివురు బట్టిన యట్లుగ నుండునంతె యే,
చీడలు బట్ట వెన్నడు నసింపదు మాయదు చేవ తగ్గదీ
పోడిమి బాడబ త్రయము పూర్ణ తమంబుగ యెంచె లోకమున్ 34

చ. తలక్రిందైనను జేయఁగా గలదు సంతాపంబులన్ బాపఁగా
గల దింద్రాదుల నీడ్వఁగాఁ గలదు పోగాలంబునుం ద్రిప్పగా
గల దాశాఽవధి నేలుకో గలదు త్యాగ శ్లోక్యమై పూర్ణమై
వెలయుగాఁ గల దిట్టి బాడబ యశోవేదంబు క్షీణించునే? 35

ఉ. నీటిని బీల్చు నగ్గి, యవనీ స్థలిఁ దాల్చు మహాభ్ర విభ్రమ
స్ఫోట సువర్ణ లక్ష్మి గని, చొక్కపు జీవ మణి స్థలంబుతా
వేటి కులాలకుం బతి మహేశ రమేశ విభూతి ధామ ము
త్పాటిత పాప సీమ, బడబ ప్రతి భాగము నామ మల్పమే ? 36

ఉ. ఆరని బ్రహ్మతేజము మహత్తర శక్తి విరాజమాన వి
స్తార తపః ప్రభావ మహితంబు నపార కృపా మయంబు, దు
ర్వార నిగర్వ నిర్వహణ వాహ మకల్మష సౌమనస్య సం
స్కార మమోఘ మా ఘనుని చక్కని భావము స్వల్ప సాధ్యమే ? 37

క. అని యపరోక్ష విభూతిం
గనుగొను నా త్రితయ భావ గంభీరైక్యం
బును గమనింపఁగఁ బరమే
శుని కైన నసాధ్య మదియ చోద్యము చెప్పన్ 38

ఉ. ఒండొరు లైక మత్యమున నొక్క పనిన్ సరిచేయ నెంచుటే
కొండొక గొప్ప కార్య మది కోరియుఁ గోరక యున్న ముందుకై
రండని పూన్చుటల్ శుభ పరంపర కారని యాలవాల మి
ట్లుండుట యత్న సిద్ధి గన నోపుట రెండును ధీరకృత్యముల్ 39

ఉ. ఏది తలంచె నాయతి యదే సరిదీశుఁడు నీ దలంచె నిం
దేదియు బొల్లు వోదని యనేక విధంబుల జీవరత్న సం
పాదన జేసి యౌర్వ శిఖి వచ్చెను రూపము దాల్చి, వచ్చి త
న్నాదిని దెల్పె హేషగతి యయ్యది, వారికి బోధమై తగన్ 40

మ. సహకారోద్యమ మిట్టి రూప మని సాక్షాత్ప్రక్రియన్ జూప నీ
మహనీయుల్ దలపెట్టి రేమొ! భగవన్మాయల్ ప్రదర్శించి ని
స్పృహ వృత్తిన్ పచరించి రిచ్చు కొను మత్ప్రేక్షోక్తు లిందేవి లే
వహహా! యేమి సమాధి! మోక్షగతి యా యద్వైత సిద్ధాంతమే ? 41

శా. భానాభావ విభావ నాది విషయా భావంబు, నిర్వ్యాజమున్
కైవల్యంబు, చిదాత్మభూతి విమలాకాశాది వద్వర్తనల్
జీవన్ముక్తి సమాధి లభ్య, మది సజ్జీభూతమేయైనచో
నేవే నక్కర లుండునే కలగవే యిష్టార్థ సంసిద్ధులున్ 42

శా. లోకారాధ్యులు లోక సేవకులు గా లోకైక కల్యాణమే
యాకాంక్షింతురు, పుత్రవత్ప్రియముతో నాలింత్రు పాలింత్రు శ్రీ
భూ కాంతా శుభ సౌఖ్య సంపదల తావుల్ నాక లోకంబుగా
నా కల్పస్థితి సేయఁ జూతు రిది, తన్న్యాయంబు పాలింఁగన్ 43

ఉ. కావున నా మహాత్ము లవగాహన మాత్ర సమాధి నిష్ఠులై
యావల లేచి సైగలఁ బ్రయాణముఁ జేసిరి, యబ్ధి మాయమై
పోవ, యతీశుఁడుర్ వినయ భూపతి పాలికి పోయెఁ బోవుచోఁ
దా వెనువెంట నౌర్వశిఖి తత్తడియై, పఱతెంచె వింతగన్ 44

ఉ. కొందఱు కద్భుతాశ్వమయి, కొందఱు కంటికి చచ్చు పీన్గనై
కొందఱు కుత్త రోగియయి, కొందఱు కెవ్వియొ! వైకృతంబునై
యందఱు కన్ని రీతుల ప్రియంబు భయంబును వింత దోహగా
సందడి హెచ్చు వచ్చె నవ సంపద లీనెడి వాజి చెంతకున్ 45

క. గజముల కైరావతమై
కుజముల కొక వింతకాంతి గొల్పుచు వినయ
ధ్వజపతి కద్భుత మొదవుచు
నజ రామర మైన బాడ బాశ్వము తోచెన్ 46

చ. నవ నవరత్న దేహము ఘనాఘన వైద్యుత దివ్య కాంతులున్
జవ పటుశక్తి, తీవి, ఘుర సంపద, శ్రావణి కోచ్చ సంస్థితుల్
భువన గభీర భావమును పూత దయామయ వీక్షణంబు, ప్రా
భవమును దెల్ప వచ్చె హయ భాగ్య విశేషము బిక్షు వెంబడిన్ 47

మ. కృతకైరావత దీపదీప్తి దనలోఁ గీ ల్కొల్పి తత్తేజమున్
వితగా జేసి స్వకీయ రత్న కిరణావిర్భూత భూరిచ్ఛటల్
క్షితిసావాస విలాస భాసురములై, చిత్తభ్రమన్ గొల్పుచున్
యతి వెంటన్ జన దెంచె నశ్వపతి తా నాదిత్యు తేజంబునన్ 48

తే. ఇట్టు లరుదెంచు నా యతి కెదురు వోయి
వినయ భూపాలుఁ డర్ఘ్యాది విధులొనర్చి
అంతఃపురంబున దెచ్చి యాసీనుఁ జేసి
ప్రక్క నిలుచుండ యతియు నవ్వాజి జూపి 49

శా. రాజా! ఆడిన మాట తప్పక యిదే రత్నాశ్వముఁ జూడుమా
తైజ స్తోమము జీవరత్ననిధి త్వ ద్భాగ్యాను సంధాతయుఁ
నీ జన్మంబు తరింప జేయు మణులఁ నిశ్చాధికం బింక ని
ర్వ్యాజ స్ఫూర్తిగ నుండు మీ! తనయకై వాంఛించి యే తెచ్చితిఁ 50

క. ఇది బాడ బాశ్వ రత్నము
వెదకిననుం గాన రాదు వెఱ్ఱుల కెందుఁ
చదువరి! కనుఁగొను మిందలి
హృద యార్థము జీవరత్న హేరాళతయున్ 51

క. అని పలుకు నంతలోననె
తనువుఁ విదళించె తేజిత త్తనువున నుం
డిన తేజ మింద్ర తేజము
ఘన తేజము లన్ని కూడ గలిగెఁ మణులై 52

ఉ. రాసులు రాసులై భవన రాజము నిండ నోకం డొకండె యా
రా సిరి మించిపోవ నివియెన్ని? యమూల్యపు జీవరత్నముల్
భూసురశక్తి యౌర! యిహముం బరముం గబళింప నోపు నం
చాఽసుర భావముల్ విడిచి యందరు మ్రొక్కిరి యా యతీశ్వరుఁ 53

ఉ. వాజియు నా యతీంద్రుని శుభస్కర వాంఛిత సిద్ధిఁ దీర్చి తా
నా జలరాశికిం జనియె నంబర వీధిని దివ్య తేజమై
రాజులు మంత్రులుఁ బుధులురంబునఁ జేతులు, వ్రేలు ముక్కుపై
యోజనఁ జేసి వింతపడు చుండిరి యా యతిశక్తి కెంతయుఁ. 54

ఉ. ఏ మిది యింత వింత? యతి యే ? మిటఁ వచ్చుట యేమి ? గుఱ్ఱమే
మీ మహనీయ దివ్య మణులే? మిటఁ దెచ్చుట యేమి ? యిచ్చుటే?
మేమి? వియద్గతిం జనుట, యేమి యిదంతయుఁ జూడఁ జూడఁ నే
స్వామి విచిత్రమో ? తెలియ జాలము మ్రొక్కెద మింత కియ్యతిఁ 55

ఉ. జోలికిఁ బోవరా దితఁడు శుద్ధుఁడొ సిద్ధుడో దివ్యమూర్తి మా
పాలిటి దేవదేవుడయి భద్రము లెప్పుడుఁ బల్కుఁ గాక - తఁ
హేళనఁ జేయువాని తన యిష్టముఁ దీర్పని వాని పావక
జ్వాలలతోనఁ బద్ధ యటుః ప్రాణముతో జన నుండ నిచ్చునే ? 56

ఉ. సిద్ధ వచస్కుఁడీ తపసి, చేసిన శాబ్దిని చెల్లఁ గట్టి నాఁ
డిద్ధర యెల్ల నొక్క మణి కేనియుఁ జాలదు, రాచపట్టి నీ
సిద్ధుడు కోరె పెండ్లి కయి చేయుటఁ యెట్టులు చేయకుండు టె
ట్లు, ద్ధతిఁ జూపు నేమొ? తన యుక్తుల చొప్పునఁ బోవు టొప్పదే 57

క. అని వింత వింత బడుచుౝ
జననాథుడు సభ్యులుండ సన్యాసియుఁదా
ననె నిటు, రాజా! మీ రడి
గిన మణు లివ్వియె కద! పరికించితె వీనిౝ 58

మ. ఇవి కల్యాణ వర ప్రసాదములు మీ కిష్టార్థ మీ డేర్పితిౝ
భవితవ్యంబు వచింపు మిప్పుడు, సుతాపాణి గ్రహోలాస్యముౝ
లన మాత్రంబు సహింప సత్వర సముల్లాసుండవై చేయు మే
యవధిౝ బెట్టకు రేప నిర్ణయమునా నానం దినై యుండెదౝ 59

శా. చింతం బొందకు, మేల మేల తనయౝ జిన్నారి కల్యాణిఁగా
గాంతుౝ, నీ వలె నేను (నాౝ + వలెనె) నావలెనె నీ కన్యార్థ మన్యార్థమే
భ్రాంతిం దేరి వచించ కాల విదులౝ రావించు మాదిత్యుడే
కాంతా రంభరతిౝ జరించు నిపుడే కావించు సిద్ధాంతముౝ 60

చ. అని వచియించు చుండ ''విభునానతి రేప శుభం బటంచుఁ బ
ల్కి నొక విపశ్చితుండు, యతికిౝ ముదమయ్యెను లేచి పోయెరో
జనుచర - మంత్రి వర్గముల యాస్యముఁ జూడగ కార్యకర్తలై
కనఁబడి రంద ఆ యతినిఁ గాదను వారలు కల్గ రెవ్వరుౝ 61

ఉ. ఎంతటి భీతి పుట్టినదొ! యేమనునో! యతి, పెండ్లి కార్యముల్
పంతము లాడినట్లు విరళంబుగ సాగిన వాపురంబునం
దంత యలంకృతుల్ జరిగె నద్భుత కల్పన లన్ని జూచిని
ష్కాంతిని భాస్కరుండు చనె సాగునె గర్వము సర్వకాలముౝ 62

మ. ఉరు జీవన్మణు లాపురాంగణములం దుచ్చై గ్గతిౝ జొచ్చి, వే
ల రవుల్ వెల్గిన యట్లు చిత్రకిరణాలక్ష్యంబు లై సొంపులై
విరులై హారములై విహారములునై విశ్వైక చిత్రంబులై
యరవిందంబులు కైరవంబులు ముదంబందం బ్రకాశించె సూ! 63

ఉ. వేడిమి లేదు, శైత్య మనిపించదు, చీకటి కాదు, హాయిగా
వాడని పూవులందలి సువాసన లీనుచు నల్లనీచుచున్
బాడుచు నాడుచున్ విబుధ భావము జూపుచు పాత్ర ధారులై
నాడొక వింతగా బహుళ నవ్య విధంబుల జూపె నమ్మణుల్ 64

మ. ఆ రత్నంబుల లోనఁ గొన్ని వని యా యంతః పుర స్త్రీలుగా
మారెన్, భేదము లేదు మాటల రుచిన్ - మర్యాద నెందేనియున్
వారెవ్వారలో ? వీర లెవ్వరో ? యొకే ఫక్కింగనంబోలు వా
రా రామామణు లొక్కరీతిగ వివాహ వ్యాఖ్య గావించుచున్ 65

మ. ఒక మాణమ్మ-యొకా నొకమ్మ మఱి యింకొక్కమ్మ-మాణమ్మ యి
ట్లొకటై, తాము జతల్ జతల్ వని ప్రియం బుత్సాహమున్ గల్గ రా
జకుమారిన్ దరిజేరి, కన్నియ! మహైశ్వర్యంబు సౌభాగ్యమున్
సకల శ్రీయుత రాజ యోగము వధూ! సత్యంబు నీ కయ్యెడున్ 66

మ. అని దీవించుచు నేగుచుండు, రది రత్నాగార, మా కన్నెయున్
మణియే యేట యెఱుంగ అందఱును నా మాణిక్యపుం బొమ్మనే
కను వారై రటుగాన నిక్కమగు నా కన్యన్ విలోకింపఁగా
వనువా రెవ్వరు లేమిఁ బ్రజ్ఞకు రహస్యం బేర్పడెన్ వింతగన్ 67

చ. పరమ రహస్యమై యతి శుభంబని యిచ్చిన మంత్రయుక్తమౌ
భరణిని విప్పి చూచి తన భావి శుభంబు లెఱింగి ప్రజ్ఞ సం
బరమున నుండెఁ, కూతురి యభాగ్య విశేషము నాత్మ నెన్నుచున్
బురపురఁ బొక్కుచున్ వినయ భూపతి వచ్చె విధేయతోడుగన్ 68

క. వచ్చిన జననీ జనకులు
ముచ్చట లొలుకంగఁ బ్రజ్ఞ మ్రొక్కులు మ్రొక్కెన్
దెచ్చెను పీఠము లిచ్చెను
ముచ్చికఁ గూర్చుండెఁ దల్లి మరుగున నల్లన్ 69

శా. అంతన్ దల్లి విధేయ - బిడ్డ తలపై నల్లల్లనన్ సారుచున్
వింతాక్రాంత మనంబుతోఁ జుబుకమున్ జే నూచి బిడ్డా నినున్
గాంతారంబునఁ ద్రోయు చుంటి మనుచున్ గాద్గద్య కంఠంబుతో
నెంతో! రోదిలి మూర్ఛవోయె జనకుం డింకెట్లు వాపోవునో! 70

ఉ. కంటిఁ గదమ్మ నిన్ను, కనకమ్మని యెంచితి నమ్మ నిన్ను మా
యింటి వెలుంగ వంచు మది నెంతయొ నమ్మితి నమ్మ నిన్ను మ
న్నంటని యట్లు పెంచితిఁ గదమ్మ యిదాది యతీశు పాలుగా
కంటకు నోచికొంటి కద ! కాలము మారె గదమ్మ పుత్రికా ! 71

చ. చదువుల మేటి వైతివి ప్రశాంతవు ధీరవు, స్మేరమూర్తి వా
మదనుని మొల్క విందుముఖి! మత్కుల పావని వమ్మ! యట్టి ని
న్న దయుడ మూఢుఁడం జడుడ నాయతి కీయక తప్పనట్లు నా
కొదవెను దుర్ఘటంబు విధి యోగము నాకిటులున్న దమ్మరో! 72

శా. సత్సంతానమ వాడు బిడ్డవు మహాసామ్రాజ్య రాజ్ఞీ పదం
బుత్సాహంబున నిర్వహింప గలవం చూహించు చుంటిన్ వృధా
మత్సంకల్పము బూదిహోమ మది నిర్మానుష్యపు గోనన్
వత్సా! కాపుర ముంచఁ జూపినది యూ వ్యర్థాత్మ చింతింపకే 73

శా. నానారాజకుమార వీరవరు లున్నారన్న ధైర్యంబుతో
నే నుంటిన్ని దినాలు నీ కొరకునై యెందెందరో వచ్చియున్
బోనేపోయిరి మళ్ళి, యొల్లము కదా! పుత్రీ ! యతీశుండు నిన్
దానం బిమ్మని కోరె నెట్లిడుదు నీ ధర్మం బెటే నున్నదే ? 74

మ. యతికిం బెండిలి యున్నదే ? మునుపు ని న్నర్థింపఁగా దుర్ఘటం
బతుకుం బెట్టితి నొండు, బంపెతి నదే యబ్దంబు కాలేదు పూ
ర్తి తయా రయ్యెను జీవరత్న తతితో దేదీప్య మానంబుగా
నతనిన్ గాదను టొప్పునే యతనిలో నాంతర్య మేమున్నదో ? 75

ఉ. ఇచ్చెద నంటికాని మన సెక్కడ నిల్డు తెల్లవారఁగా
వచ్చును త ద్యతీశ్వరుఁ డవశ్యము వత్స! హృ దంతరాళమున్
చిచ్చు దహించు చున్నదిఁకఁ జెప్పెడి దేమి? విధేయ నీది నేఁ
జచ్చిన వానితో సముఁడ, జాత! యటం చని తండ్రి మూర్ఛిలెన్ 76

క. ఇట్లా యుభయులు మూర్ఛిల
నెట్లో యా ప్రజ్ఞయు యతి యిచ్చిన మంత్రం
బట్లట్లన స్మరియించుచు
జెట్లాకుల నల్లవీచి సేదం దేర్చెన్ 77

క. జననీ జనకుల నొకచో
ననువుగఁ గూర్చుండఁ జేసి యాప్రక్కన తాఁ
గనుగొనఁ జదువుల యమ్మన
వనజావన గూరుచుండెఁ బద్మాసనయై 78

# తృతీయాశ్వాసము

## - (విధిగీత) జీవయాత్ర -

శా. అంతన్ బ్రజ్ఞ యతీశ్వరాత్త మను మాహాత్మ్యంబునన్ దాను వి
భ్రాంతిన్ జెందిన తల్లి దండ్రుల మనోవైక్లబ్యమున్ మాన్ప - ని
శ్చింతాయత్తుల జేయ, లోకమునకున్ శ్రేయస్సులం గూర్ప వే
దాంతోక్తుల్ వచియింపఁ బూనె విధిగీతాఖ్యానమన్ పేరిటన్ 1

మ. జనకా! నన్ను గుఱించి యిట్లు బహు కష్టాలేర్పడెన్ నీకు నా
జననం బింతటి కష్ట హేతువు కదా! సన్యాసి ధన్యాత్ముఁడీ
నను శంకింపకు దాన మిమ్ము కొనుమా యంచున్ ముదంబంది తా
ననుకూలించును, నాకు స్వస్తి నిడు, కల్యాణంబు సంధిల్లు సూ! 2

శా. చింతింపం బని లేదు - వీడు మమతన్, శ్రేయః పద ప్రాప్తికై
స్వాంతంబున్ సరిదిద్దు కొమ్ము, తెగదీ సంసారపున్ బంధం, మిం
దింతో! యంతొ! సుఖంబు - దుఃఖమును రానే వచ్చు రాకుండ, నీ
భ్రాంతుల్ దప్పవు - జన్మమెత్తిన తఱిన్ ప్రారబ్దముల్ వాయునే ? 3

ఉ. జీవుఁ డనాది ప్రాకృతుడు చేసిన యాదిమ కర్మ బీజముల్
భూవలయంబు నందుఁ బడి పుట్టువు లందెను పాప పుణ్యముల్
జీవన మిచ్చి పెంచు, నవి చెట్లయి రెండు విధాల పండ్లఁ సం
భావనఁ బండుచున్నయవి పట్టవ వెందును క్రింద మీఁదనున్ 4

మ. విమ లాకాశము వీధిగాఁ దిరుగు నీ విశ్వంబు జీవుండు, దే
హములన్ దాల్చును - వీడు బెక్కు లిదియే ప్రారబ్ద కర్మంబు దీ
ని మహాజ్ఞాని యొకండు మాత్రమె ప్రయత్నింపన్ తఱింపన్ దెగున్
క్రమసాధ్యం బిది కాన, దీనిని సుమా కాంక్షింపనౌఁ బండితుల్ 5

ఉ. ఆదిమ పూర్ణ యోగ బల మద్భుత శక్తి వహించి, విశ్వ ము
త్పాదనఁ జేసె తత్త్వ మసి వాక్యముఁ బల్కెఁ దదాది మాయయై
బాదర బందిగాఁ ద్రిగుణ వర్గపు సర్గము రూప సర్గ, మి
త్యాదిగ సృష్టిఁ జేసె నది . యాపురుషుండ్ గననీయ దేరికిన్ 6

క. అన్నిటి కాధారమ్మగ
బన్నెను కాలంబు - మిన్నుఁ - బ్రకృతి - యనంతాఖ్య
ఖ్య న్నెగడిన వవి యాత్మాఖ్య
భిన్నము లన నొప్పు, వాన విశ్వము కలిగెన్ 7

క. తన్నుం దనపతిఁ బోలిన
యన్ను వలను - మగలఁ గూడ నాయమ కనియెన్
అ న్నలు వాదులు వారలె
యెన్నఁగఁ ద్రైగుణ్య సృష్టి యిట్లేర్పడియెన్ 8

ఉ. బీజము లోన మొక్క వలె విశ్వము మున్నది నిర్వికల్పమై
యా జగదీశ్వరీ మహిమ నద్భుత వైఖరి మళ్ళి కల్గ, ను
త్తేజము తోడ వ్యాపిఁ గను, దేవుఁడు మాత్రము నిష్క్రియుండు ని
ర్వ్యాజియు, నిర్మముం, డతని యంశయె జీవుఁడు ప్రాకృతుం డొగెన్ 9

శా. మాయా కల్పిత నాటకంబు, సుఖమే మాత్రంబు లేదింత జీ
వాయత్తంబును కాదు పాత్రధరు డాయావేషముల్ వేయు న
ట్లాయా జన్మము లెత్తు, క్లేశపడు నా యానంది సామాజి కుం
డీ యర్థంబును గుర్తు పట్టు జనకా! యీక్లేశ మీ కేటికే ? 10

శా. సంసారం బది యూర్ధ్వమూల విషవృక్షం బందు జీవేశ్వరుల్
హంసాఖ్య భాసములన్ వశించెద రవిద్యా మాయ లయ్యీర్వురన్
సంసర్గార్థము చేరి రోలి యభవల్, సంచార శీలుండు కా
నం సాగించె న విద్య జీవునిఁ బ్రయాణ, ప్రప్రయాణంబులన్ 11

మ. తలక్రిందౌ తరుశాఖ లందుఁ దిఱుగన్, దత్కోటరాఖ్య వాసముల్
సలుపన్ బత్రము లానఁ దత్ఫల రస స్వాద్యంశముల్ గ్రోలఁ, ద
ద్వలస చ్ఛోక ముఖ స్వభావముల నుద్విగ్నుండుఁగా, ధాతు సం
కలనన్ జూచి, యవిద్య జీవు నెపుడున్ గావించి త్రిప్పున్ పితా! 12

శా. కొమ్మ ల్గొమ్మలు రెమ్మరెమ్మలు నుటంకుల్ జేసి లంఘించుచున్
నెమ్మిం ద్రిప్పును వెంటఁ గొంచురవడిన్ వేల్వేల సంతానముల్
తమ్ముం బోలిన వానినే కనుచుఁ దత్సంతానపుం బోషణం
బెమ్మైమ్రఁ జేసెదొ! సేయమంచనును, గర్హించుచున్ క్రియా శూన్యతన్ 13

చ. పయనము క్రింద, జీవుని స్వభావము మెత్తన యుత్త చేతు లా
పయన ననంత సంతతి ప్రపంచము దొడ్డది వాని కింక చా
లయినది ముండ్లఁ గ్రుచ్చుకునె, నాగిరు లీగిరు లెక్కి దూకె, గో
ఝయిన గణింప నీయ దవురా! పతి లోగును కాంత లిట్టిరే! 14

ఉ. ఏమన లేక స్రుక్కి తన కేగతి తోపమి జీవు, డౌర! యీ
కామిని బారి కగ్గమయి కాదె! యిటైతిని యెందు జొచ్చితిన్?
నామది కెంత మోహాము! కనం దగునే ? యిటువంటి కష్టముల్
సేమము లే దొకింతయు విశిష్టతఁ గంటినె? నిన్ను గామినై 15

శా. నాకీ లోలత యేల గల్గె ? నిఁక నీ నారేలన్ గూడె ? నీ
నాకేనా ? యిటువంటి సంఘటన యా నా సోదరున్ గూడెనా ?
లోకైక ప్రభు వాతనిం గలచునే యీలోల చేష్టా వళుల్
రాకల్ పోకలు లేని పోని విషయా రంభంబు లాశించునే ? 16

చ. కదలక యున్న చోటున సుఖంబుగ, నుండును, గాక నే నిటుల్
మెదిలితిఁ బిచ్చి వట్టితిని మేలొక యింతయు లేదు, కీడు నా
కొదవిన దేమి సేసెద నయో మయ మీ మన మింత తుచ్ఛ సం
పదలకు మోస పోతిఁ తన వానిని వీడుట యెంత పాపమో ! 17

ఉ. ఏ గతిఁ బోదు దేవుఁగను టెట్టులు దీనిని వీడు టెట్టు లీ
సాగిన త్రోవ యేమి ? యగ చాట్లివి యేమి ? ఇటెంత దాఁక నే
నేగవలెన్ ? ప్రయాణ ముడిగింపగ రాదె ? యధోగతిన్ జనన్
నా గతి యేమి ? కోట్ల జననంబుల నందితి నజ్ఞ యోగినై 18

ఉ. అష్ట విభూతులంది హరునైతిని యెక్కడ, నొక్కెడన్ జగ
త్సృష్టి యొనర్చితిన్, నడపితిన్ విభునై యొకచో నవిద్య నన్
వ్యష్టి యొనర్చె నిట్లు, గుణ పాదప సార ఫల ద్వయంబునన్
గష్టమె నాకు దక్కె, సుఖి కాదొకొ, దేవుఁడు తావుఁ దప్పమిన్ 19

ఉ. కుక్కయి కోతినై బురద గుంతల దొర్లెడు పందినై వనిన్
నక్కయి, పక్కినై క్రిములు నాగములై జల జంతు కోటినై
యెక్కడఁ జూడు నేన యొకటే యొక టెత్తున జన్మమెత్తుటే
తక్క మఱేమి లే దిదియ తథ్యము మత్కృత కర్మమే సుమా ! 20

ఉ. ఆది సుఖంబు కష్టమొక టవ్వల నివ్విష వృక్షపుం ఫలా
లేదెవ రందుకో గలరొ ? యొక్కటి వారికి దక్కితీరు, ని
ర్వాదము దీని తీరు, సుఖభాగులు క్రిందికి రారు పైకిఁ బోఁ
బోఁ దరమే ? యవిద్య విడిపోవునె? క్రిందికిఁ ద్రొక్కి వేయదే ? 21

క. ఎగఁ బారిన సుఖ ముండును
దిగ జారిన దుఃఖ ముండు ద్రిమ్మరు మనమున్
సొగసైన త్రోవ బెట్టిన
దగ నానందంబు దొఱకు తథ్యము సుమ్మీ 22

క. ఈ విష వృక్షపుఁ బాదున
కావల గలదేమొ ? తెలియఁగా దెవ్వరికిన్
లేవే వాకులు, మానస
మీవలనే తిఱుగుఁ గాని యేగదుపయికిన్ 23

మ. తిరుఁడా నందమయుండు చిద్ఘనుడు నా దేవుండు నిర్మోహి, ని
ష్పరి వారుం, డమలుండు వానిగన నిష్పపిష్ఠి కెట్లోపు ? దు
ష్పరివారుండ నవిద్యుడన్ మఱచితిన్ సత్సంగతిన్ మానితిన్
తెరువేమో! కద, దారిఁ దప్పితిని నిస్తేజస్వి నైపోయితిన్ 24

శా. నా నానాగతి హ్రస్వమైన నవయన్ భావంబు తోపన్ మహా
మౌనంబూని, త్యజించి యూర్ధ్వగతి కెమ్మె ఱెక్కలన్ సారెదన్
దానావెంట నవిద్య రాదు వెనుకై తారాడు వేదాంత వి
జ్ఞానుల్ పోయెడుఁ ద్రోవఁ ద్రొక్కెదను మోక్షప్రాప్తి నా కయ్యెడున్25

తే. దీని సహవాస మికఁ జాలు దెలివి వచ్చె
నింతనైనను సంసార చింతమాని
జ్ఞాన మార్గాన నాదేవుఁ గానఁ గలను
వలదు వల దెన్నడున్ బంధ వర్త నంబు 26

చ. అనుచున్ దాకిన తాకులన్ దలఁచుచున్ హా! దైవమా ! దైవమా!
ననుఁ గాపాడవ! చూడవా! పతితుఁడన్ బంధంబులం ద్రెంపవా !
నను నీ చెంతకు చేర్చుకోవ శరణ న్నాడన్ క్షమార్హుండ నే
ననుచున్ జీవుఁ డొకొక్క మెట్టెగయు భక్త్యా విష్టుడై నిస్పృహన్ 27

చ. పరిపరి రీతులన్ బయికిఁ బ్రాకగ నెంచును వాఁడు వెంటరాఁ
ద్వరపడు నాయవిద్య, ఒక భక్తి పథంబును, జ్ఞానమార్గమున్
సరిపడ వామె, కౌర! తన చాయకు రాదది వెన్కఁ జిక్కు, నా
తరుణమె భక్తుఁ డెక్కవలెఁ దప్పినఁ గ్రిందికి నీడ్చి కొట్టదే! 28

చ. ఇక గతులుండ బోవు, తరియించుట కష్టము క్రిందబడ్డవాఁ
డొక రహదారిఁ బోఁగలఁడె ? యుండిన జ్ఞాన లవమ్ము వమ్ము కాఁ
దికమక బట్టి నీచగతిఁ దిండికిఁ దిప్పుట మంది దుర్గతి
ప్రకట కుమార్గ వర్తన నిరంతర ముండక మోక్షమందునే ? 29

ఉ. భక్తి ద్వారము సత్యమార్గము లసత్ప్రజ్ఞాన ఖేయమ్ము చి
చ్ఛక్తి త్రాతము పుణ్యవప్రము మహా సమ్మోద సౌధమ్ము నౌ
ముక్తి ప్రస్థపురంబు చేరఁ దరమే! ముర్ఖాళి, కజ్ఞానపుం
వ్యక్తుల్ దేవునిఁ గందురే ? అకట ! యామ్యాధ్వ శ్రమల్ దప్పునే ? 30

చ. మఱి మఱి యా యవిద్య తన మాంద్యము వీడి యనేక రీతులన్
స్థిరతర బంధనా లిడి విశిష్టత సర్వము మంట గల్పి దు
ర్భర జననాది యా మరణ బాధలఁ బెట్టెడు నీ యవిద్య నె
వ్వరు దరిజేర నీయరు శుభస్కర మోక్షము వారిదే సుమా! 31

ఉ. జీవుని నావరించి దరిఁ జేరగ, నీయక ముక్తి మార్గముల్
లేవనిపించి నీచమగు లేవడి జన్మము లెత్తఁ బంచి యే
చావులొ! చంపనేర్చె నది, సద్గతిఁ గానక జీవు డల్లలో
దేవుఁడ యెక్కడుంటివని దేబిరి యేడ్చును, లాభ మున్నదే ? 32

ఉ. మానవుఁడై జనించి తన మానవ ధర్మము మంటఁ గల్పి య
జ్ఞానపు టంధకారమునఁ గన్నులు మిన్నులుఁ గాన రాక కా
మానఁ బశుత్వముం బడసి మానవ పశ్వధముండు నాఁ దగున్
దా నొక జ్ఞానియై యభవతన్ బడయన్ దగు దేవుడే యగున్ 33

ఉ. జంతువు లన్నిటం మనుజ జన్మము మంచిది, యందు జ్ఞానమే
జంతుల కన్న మిన్న యది చాలని వాడు పశు స్వరూపుడే ?
వింతఁ గనన్ ద్విపాత్పశుత వేరొక టేమియు లేదు కాన వే
దాంత వివేకముం బడసి తప్పక మోక్షము నందగాఁ దగుం 34

ఉ. పుట్టిన నాటి మానవుడు ఘోరని యేడ్చును లాభమేమి ? యె
ట్టెట్టులో యెవ్వరెవ్వరో! మఱేమిటొ! యేమిటొ! చేసి చేసి పాల్
వట్టినఁ ద్రాగనేర డొక పల్వురు కావలె సేవకాళి తం
బట్టగఁ గప్పఁగా వలెఁ బ్రపంచమునం దితఁడేల? పుట్టెనో ! 35

చ. పశువుల కన్న హీనుఁడు కబంధము కావలె బానెడంత, యా
పశువులఁ జూడ నేది ? పరివారము, పుట్టిన తక్షణంబ యా
శిశువును నాకుఁ దల్లి, అది చేసిన పాలను లేచి త్రాగు, నా
పశుశిశు బోలునే ? మనుజ బాలుఁడు, మానవ జన్మ మల్పమే ? 36

చ. అనుదిన మమ్మ యెత్తవలె హాయిగ నీరముఁబోయఁగా వలెం
తన కస వెత్తగా వలెఁ బ్రధానము స్తన్యముఁ ద్రాపఁగా వలెం
గనుగొని నిద్రబుచ్చ వలెఁ గల్గెడి రోగము లీడఁగా వలెం
దనకయి యిన్ని కష్టములు తల్లికిఁ బెట్టెడు జన్మ మేటికో ? 37

మ. నవ మాసంబులు మోసి వేవిళులతో నానా శ్రమల్ జెంది, మా
నవ జన్మంబిక వద్దురా! యనఁగ నంతర్వాత్మి నీళ్ళాడు చో
భవితవ్యంబును క్రిందుమీఁదులయి పోవం గన్న యా తల్లి యం
దవతారంబును దాల్చె నిట్లగుట దా నాశా వధుల్ గాంచునే 38

ఉ. ఆశల కంతు లేదు మనుజాళికి, గావలె నన్ని వానికై
లేశముఁ దీరుఁబాటుఁ గన లేఁడు ప్రపంచము లేలఁ జూచు, ని
ట్లాశల తోడఁ బుట్టు మను జాధము కృత్యము లిట్టి వంచు
నిర్దేశముఁ జేయ నౌనె ? విపరీతపు బుద్ధులు కర్మ బద్ధముల్ 39

ఉ. పుట్టిన దాదిగా గలుగు బుద్ధులు వెన్కటి జన్మలోనివే
చుట్టము లట్లు వచ్చుఁ దనఁ జుట్టియె యుండును వీడఁబోవుఁ గాఁ
బట్టి గుణాగుణంబుల స్వభావము సత్వరజస్తమో మయం
బట్టి వెఱుంగఁగా దగు దయామయ సద్గురు బోధలందినం 40

ఉ. సత్యము ధర్మముర్ శ్రుతము శాంతము దాంతము నీవి విద్య స
త్కృత్యయ మాస్తికత్వము తపంబు దయాళుత విజ్ఞ గోష్ఠి, యీ
కృత్యము లన్ని సాత్వికపు కృత్యము లీయవి బ్రాహ్మణంబులై
ప్రత్యగ భిన్నమై వెలుఁగు బ్రహ్మముఁ జేర్పును చేయువారలర్ 41

తే. గర్వ మందక నంతర్ముఖంబు గలిగి
నివురు కప్పిన నిప్పునా నెగడు వాఁడు
బాలు నున్మతు భూతంబుఁ బోలు నతఁడు
ముక్తి నొందును వైరాగ్య పూర్ణ మూర్తి 42

తే. ధర్మ మర్థము కామ మీ త్రయము తవిలి
క్రమము దప్పక సాధింప కలిగె నేని
మోక్ష మందును సాత్విక మూర్తి యట్లు
కాక, విపరీత మైన చోఁ గలుగు జన్మ 43

తే. శుద్ధ సాత్విక వర్తను లిద్ధ తపము
జగము నందుండియుం గూడ జగము మఱచి
అంటి యంటకఁ దామర పాకు నీటి
బోలి యుందురు మోక్షంబుఁ బొందు వారు 44

తే. ఉన్న యంతలో సంతోష మొందు చుండి
వచ్చు నతిథుల కాతిథ్య మిచ్చు చుండి
తత్వ చింతన సేయుచుర్ దైవ భక్తి
కలిగి యుండిన వాడెపో కనును ముక్తి 45

తే. ఏమి యెఱుగక దేవునే యేక భక్తి
ధ్యాన మొనరించి కీర్తించి తన్మయంబు
నందు మూఢభక్తుడు మోక్ష మందువాడు
వాని సాటికి వత్తురే ! పరమ మునులు ? 46

తే. ఏరి కపకారము కాని దారిఁ బట్టి
దయయు సత్యంబు వ్రతముగాఁ దనరు వాడు
పరమ శాంతుఁడు శ్రుతమును జరుపు వాఁడు
మోక్ష మందును సత్క్రమ దీక్షి యగుచు 47

ఉ. ఆకటి వ్యాధికిం దగిన యట్ల చికిత్స యొనర్చు టాశగా
సాకిడి పల్కరా దధిక సంగతిఁ గోరుట యాశనాఁ జనుల్
ప్రాకట మోక్షకామము నభాగ్యులు కొందఱు కామ మందు, ఔ
యౌక ? వివేకు లందురే ? ప్రయత్నము దానికిఁ గాక దేనికో ! 48

క. వర్గ త్రితయము కావలె
స్వర్గాధిక సుఖము కోరకు, బహువిధ గతుల్
దుర్గతిఁ గనవలె, నిఁక నప
వర్గము మోక్ష, మిదియ వాంఛింప వలెన్ 49

చ. శుచిముఖి, శ్రోత్రియుండు, పరిశుద్ధుడు సిద్ధుఁడు బ్రహ్మనిష్ఠయం
దచలుఁడు బ్రహ్మ విద్వరు డహంకృతి దూరుఁడు నాత్మ బోధకుం
డు చితుఁడు నైన సద్గురుఁ డహో! ఘటియింపఁగ కోటి జన్మ సం
రచిత మహా సుపుణ్య ధనరాసులకే తగుఁ గాని యన్యమే 50

తే. అట్టి సద్గురు సద్బోధ లంది యంది
యనుభవంబుల గడియించి యాత్మ నెఱుఁగ
వలయు నెఱిగి బ్రహ్మము జేర వలయుఁ దండ్రి!
యనుచు వచియించి ప్రజ్ఞ యిట్లనియె మఱియు 51

ఉ. పాత విశేష భీతి మతి బాతుకొనంగ క్షణ క్షణంబు సం
జాత వివేక మార్గమునఁ జక్కఁగ నొక్కొక మెట్టు నెక్కి, యా
భూతకి కందరాక తరుమూలముఁ జేరఁగ నాత్మ సోదరుల్
జూతు నటన్న యుత్సుకత జొత్తిల జీవుఁడు పోవుచుండగన్ 52

## మాయాదర్శనము

చ. అటఁ గల మేడ వాకిట నొయారి యొకానొక కాంత యడ్డమై
పటమును గప్పి నిల్వఁ, గని పాపము ! జీవుఁడు మానసంబునన్
గటకటఁ జెంది యప్పడతి కారియ వెట్టఁగ ముంద వచ్చె, న
న్నెటుఁ జననీదు గాక, గతి యేమని పెల్లున కృళ్ళి పోవుచున్ 53

చ. కదలక నవ్వుచున్ విభునిఁ గానఁగ నీయక యడ్డమున్న యా
సుదతినిఁ జూచి, యన్య యని చోద్యము జెందియు ధైర్యమూని, యి
మ్మదవతి యేమి సేయునొ! యమానుష శక్తులు స్త్రీలు నువ్వె ? తా
రదయలు యోగమాత్ర బలహారులు వీరిని నమ్మఁ బోలునే ? 54

ఉ. తింటిని పెక్కు దెబ్బలను తీంగ్రమము వాసెను నా సహోదరుఁ
గంటకు వచ్చితిన్, గృహము కా దనఁ బోలదు, కాని వాకిటన్
ఒంటరి యున్న దీయమ మహోజ్వల తేజము తోడ నొప్పు నా
జంట సహోదరుఁ గలియ జాలనె? యీయమ యడ్డమున్నదే55

చ. అడిగెదఁ గాక నే ననుజునై పఱతెంచితి నమ్మ! జీవుఁడన్
జెడితిని, వచ్చితిన్ గృహము చేరితి, దేవుడు నా సహోదరుం
డుడుగని ప్రేమమూర్తి యెట నుండునొ ! తెల్పఁ గదమ్మ ? ఒక్కమా
టడిగెద నమ్మ! నీ వెవరవమ్మ! దయామయి! నన్నుఁ బ్రోవుమా !56

చ. అనవుడు జీవ! దేవుఁడను నాతఁడ లేఁడిట, లేఁడు లేఁడు పొ
మ్మని వచియించి, 'మాయ' నని యాత్మ సమాఖ్యయుఁ దెల్పె నామె, జీ
వుని గతి యేమి చెప్ప? అనుభూతియ జాలయి పోయె, నాశలె
ల్లను నశియించె, స్రుక్కెఁదన లక్ష్యము పారమి కప్పుడాత్మలోన్ 57

ఉ. ఈయమ దేవునిం గలియ నీయదు నాకయినట్లు తాను నా
స్వామినిఁ జేరనేమొ! యిలు వాయని వానికిఁ బంక మంటునే ?
నా మన వేమి తెల్ప, దెటు నాకతఁడిచ్చును దర్శనంబు ? ని
క్కామిని యడ్డమై నిలిచెఁ గాదిఁక కార్యముఁ గాన నే నిఁకన్ 58

ఉ. పెద్దగఁబేరు వెట్టి మొఱఁ బెట్టెద, లోపల నున్న వాఁడు నా
సద్దును గుర్తు వట్టి, తెరచాటుఁ దటాలునఁ ద్రోసిపుచ్చి నా
వద్దకుఁ జూచుఁ జూచి తన వద్దకుఁ జేర్చున కౌగిలించు నా
కద్దియ మోక్ష సిద్ధి యని యాత్మఁ దలంచుచు పెద్ద పెట్టునన్ 59

శా. దేవా! వచ్చితి, జీవుఁడన్ విగత సందేహుండ! యాత్రాశ్రమల్
భావింపన్ బులకించు, జెప్పు కొనుటల్ భావ్యంబులుం గావు, నీ
తావున్ జేరితి మాయ వీడదు భవ త్సందర్శనాపేక్షికిన్
నీవున్ నేనును నేకమే యని మదిన్ నిండార నే నమ్మితిన్ 60

ఉ. లేవని చెప్పుచున్న దవ లీలగ నీయమ లేక యుంటివే ?
రా వది యేల ? చూపులును రా, విది మత్కృత పూర్వ కర్మమా ?
త్రోవయుఁ దెన్నుఁ దోప కవరోధము లెన్నియొ దాపరించె, నన్
గావవ? దేవుఁడా! యనుచు గట్టిగ నార్చెడు జీవు వైఖరిన్ 61

మ. కని యామాయ ''యితండు పూర్వకృతముల్ గర్హించుచుఁ జ్ఞప్తితో
ననుమానించుచు, నన్ను మించగఁ గడుఁ యత్నించుచున్నాఁడు, దే
వుని జాడల్ గననిత్తునే ? మమత తన్ప్రాతాత్మునిం జేయునే ?.
మునియో ? జ్ఞానియొ! భక్తుఁడో యయిన నే ముక్తిఁ బ్రసాదింపనే ? 62

ఉ. ఈతఁడు వేదమాత జపియించెను, కాని వచింపఁ డేరికిఁ
జ్ఞాతయె కాని యాచరణ కల్గదు కల్గిన నప్పుడప్పుడే
పాతము సేయు, భక్తి కలవాఁడయియున్ పడిపోవు, మౌనియై
యాతనలం బడుఁ విమతి వ్యర్థుఁడు, పూర్ణతఁ గానఁ డెందుఁను63

ఉ. కావున దర్శనం బిడితిఁ గారణ జన్మము లెత్తుగాక సం
భావనఁ బూర్ణతఁ బడసి పావనుఁడై దరియించు భక్తుడై
దేవునిఁ జేరుఁగాక యని దేవి తలంచిన యంతమాత్ర నా
జీవుఁడు తల్లి గర్భమునఁ జేరె నిదే కద ? మాయ నా జనుఁ 64

ఆ. సత్తు చిత్తుఁ గాదు సచ్చిత్తులుఁ గాదు
కదలు, కదల, దుభయ గతులు లేవు
అవయవంబు లుండు నవయవి యును గాదు
రెండు లేక మించి యుండు మాయ 65

ఆ. తెలుపు నలుపు నెఱుపు- కలదారములు మూఁడు
కలిపి పెనయు త్రాటి కరణి మాయ
త్రిగుణ మయమ యగుచు జగముల సృజియించు
నది యనాది, మూల మదియ ప్రకృతి 66

త. ప్రకృతి వికృతియు నగు నామె బ్రహ్మఁగూడి
సత్వముఖ్యమై యగు జ్ఞాన సాధనంబు
వికృతి జీవునిఁ జేరి యవిద్య యనఁగ
నగు రజస్తమముల జన్మ కాకరంబు 67

ఉ. భూరుహ మొక్కటే కనును పుట్టెడు విత్తులు తండ్రి! యవ్వియే
ధారుణి వృక్షతఁ బడయు-తద్గతి, దీపము నుండి దీపముల్
కోరిన యన్ని కల్గు తఱుగుం గనఁబోలవు నట్లె జన్మలుఁ
కూరుచు వస్తు సంగతియ, కోవిద వేద్యము మాయ చిన్నెసూ! 68

ఆ. కలడు చక్రవర్తి గడియార ముంబోలె
ద్రిప్పఁ దిఱుఁగ కుండు దిమ్మఁ బోలె
ఆదిశక్తి యతని యాశ్రయంబున నుండి
లోనఁ బైనఁ ద్రిప్పు లోకమంత 69

తే. వికృతి సంగతి చేతనే వివిధ గతుల
మెలఁగు చున్నాఁడు జీవుండు మలినుఁ డగుచు
నాత్మ నెఱుఁగుట కధికారి యసలె కాక
గురుని యుపదేశమే లేక పరముఁగనునె ? 70

తే. ఆర్తుఁ డర్థార్థి జిజ్ఞాసి యైన వాఁడు
జ్ఞాని యను నల్వురుఁ దేవుఁగానఁ గలరు
సద్గురూపదిష్ట సరణి సాగు నట్టి
యాతఁ డధికారియై యున్న నగును సిద్ధి 71

తే. జనక! యా జీవుఁ డార్తుఁడై యనధికారి
యగుట చేతనె, తల్లి గర్భాలయంబు
జొచ్చె నధికారి యననేమొ ముచ్చటింతు
ముక్తి మేడకు ముఖ్యమౌ మొదటి మెట్టు 72

తే. మున్ను చెప్పిన సద్గురు బోధలంది
యనుభవంబుల గడియించి యాత్మ నెఱుఁగ
వలయు, నందులకును ముందనుబంధవర్గ
మెఱుఁగ వలయును నాల్గవి యేవి యనిన ? 73

తే. మొదటి దధికారి, యిక రెండవది విషయము
మూడు - నాల్గును, సంబంధముఁ బ్రయోజ
నంబు వీనిఁ దెలియుట ముఖ్యంబు వీని
లోన యధికారి యెట్టిడో? కానవలయు 74

తే. ఏది నిత్యం ? బనిత్యంబు నేది ? యను వి
వేక మైహికాముష్మిక విగతి రతియు
శమ దమాది సంపత్తి మోక్షమున నిచ్చ
సాధన చతుష్టయ మటంద్రు సరవి వీని 75

క. ఇవి కలవాఁ డధికారిగఁ
బ్రవచింతురు, విషయ మెన్న బ్రహ్మైక్యంబే
అవు బ్రహ్మము ప్రతిపాద్యం
బవి ప్రతి పాదకములు నిగమాంతము లరయన్ 76

క. ఈ యుభయిక సంబంధమె
యామెను సంబంధ మనఁగ నపవర్గమె కా
చేయం దగిన ప్రయోజన
మాయాత్మా నాత్మ చింతనావసరములన్ 77

క. వర్గత్రయమును కావలె
స్వర్గాధిక సుఖము కోఱకు-బహువిధగతులన్
దుర్గతిఁ బోవలె నిఁక నప
వర్గము మోక్ష మిదియ వాంఛింపవలెన్ 78

తే. ఇ[illegible]ము క్షత సాధారణమ్ము - తీవ్ర
మనఁగ రెండు రీతుల నుండు నందు మొదటి
దందఱుం గోరు మోక్షేచ్ఛ యగును సుమ్ము!
తీవ్ర మోక్షేచ్ఛనానేమొ! తెలియ వలయు 79

క. బలవత్తార త్రయములు
బలిమి ముముక్షు పురుషు బహుభంగుల సంద
గ్ధుల నొనరించును, మనమున
నిలిచిన వైజ్ఞాన ధనము నిలువునఁ దోచున్ 80

తే. అవియు నాధ్యాత్మికంబులు, నాధిభౌతి
కమ్ము, లాధిదైవికములు, కలయ మూఁడు
విధము లౌటను త్రయమని వేత్తలండ్రు
తపనఁ బెట్టెడి వౌటను తాప మండ్రు 81

తే. అరయఁ దలనొప్పి మొదలైన వాత్మరుజలు
వ్యాఘ్ర చోరాది తాపాలు భౌతికములు
పిడుగులు - తుఫాను మొదలైన భీతులన్ని
యాధి భౌతిక తాపాలటండ్రు తండ్రి! 82

తే. ఇవియు దేహత్మబుద్ధియు నింతెకాక
దేహ సంబంధ విషయాల దీర్ఘ దీర్ఘ
మైన యాత్మీయతా బుద్ధి, యనెడు నీయ
వన్ని మోహంబునాఁ జెల్లు నదియ యాశ 83

క. ఏతాదృఙ్మోహము తాఁ
జేత స్థితి జేసిఁ జీవుఁ జేరులఁ గట్టుఁ
నీతియు నియమముఁ జేకొన
దాతత మగు నడవి నతని నట్టిటుత్రిప్పుఁ 84

శా. ఆ మోహాటవి దారి తప్పి తిఱుఁగఁ - వ్యాఘ్రంబులై తోచు దు
ష్కామంబుల్, భయపెట్టు దారధన కాంక్షల్ కృష్ణ సర్పంబులై
కామాదుల్ గడిదొంగలై నిలువునఁ జ్ఞానార్థముల్ దోచు, నౌ
రా! మేలేమయినఁ గనంబడునె ? యీ వ్యామోహముల్ సెల్లునే ?85

క. ఇది తెలియుట, వారించుట
సదస ద్వివేక సిద్ధి సాధించుటయుఁ
సదయుఁడు సద్గురుఁ డిడుచో
నొదవును సకలార్థసిద్ధి యుపదేశమునన్ 86

క. అని గురు నుపదేశముతోఁ
దన కాత్మ జ్ఞాన సిద్ధి తనరిన పిదపఁ
ఘనుఁడఁ ముక్తుఁడ నని మన
మునఁ దనరు తలంపు తీవ్ర మోక్షేచ్ఛయగుఁ 87

తే. మూఁ డవస్థలకును సాక్షి, మూడు దేహ
ములకు భిన్న మైదగు కోశములను గాదు
ఇరువదియు నాల్గు తత్వాల వేమి కాని
సచ్చి దానందమే యాత్మ స్వప్రకాశి 88

తే. ఆత్మ తత్వ స్వరూపంబు నచ్చబోధ
చక్షువునఁ దావె కనవలె శాస్త్రమేల ?
కంట చంద్ర స్వరూపంబుఁ గాంచి కాదె ?
తెలియ వలయును పరులతోఁ దెలియునేమి ? 89

తే. మూఁడు దేహాలవస్థలు మూఁడు కోశ
పంచకంబు తత్వములు నిర్వదియు నాల్గు
అనృత జడ దుఃఖమయ మన నాత్మ సువ్వె ?
వీని కన్న విలక్షణ మైన దాత్మ 90

ఆ. స్థూల సూక్ష్మ కారణాలు నా దేహాలు
కలవు మూఁడు వాన తొలుత తనువు
సప్త ధాతు మయము సర్వాంగ యుతము నై
నేను నాదనంగ నెగడు చుండు 91

తే. పంచ భూతమ్ములున్ సూక్ష్మ భావమంది
స్వస్వ పంచీకృ తాంశలన్ స్థౌల్య మంది
స్థూల తనుకారణము లయ్యె నోలి వీని
యంశ లైనవి శబ్దాదు లనగ జనక 92

తే. భోక్త యగు జీవున కివన్ని రక్తి గొల్పి
కష్ట సుఖములఁ గలిగించుఁ గాన నిట్టి
స్థూల దేహమె మోహాలవాల మిందు
జొచ్చు జీవుల గతులెల్ల శోచ్యగతులు 93

తే. ఔర! శబ్దాది విషయంబు లద్భుతంబు
లందు దుర్గమమగు రాగ మనెడి త్రాట !
గట్టఁబడువారిఁ గొని పోయి కర్మ దూత
జన్మ లెత్తించు నెన్నెని జవము సూపు 94

తే. విషయ రా గోరు పాశ సంవేష్ట్య మాను
లైన మూఢుల వడివడి నటుల నిటుల
కర్మ దూతయె కొంపోయి కడక జనన
మరణ రూప సంసారాబ్ధిఁ మరలఁ ద్రోయు 95

తే. జ్ఞాన కర్మేంద్రియంబులు ప్రాణ పంచ
కంబు, భూతపంచకమును - కామ కర్మ
ములు, నవిద్య బుద్ధ్యాదికమ్ములు నివెల్ల
సూక్ష్మ దేహంబు నాఁ జెల్లు సువ్వె జనక! 96

ఆ. ఇదియె లింగ దేహ మిది యపంచీకృత
భూత సంభవంబు - పూర్వ వాస
నాఽన్వితము, స్వకృత ఫలాను భావకమున
ఆత్మ కగు ననాద్యుపాధి సువ్వె ! 97

ఆ. ఈ విభక్త్యవస్థయే స్వప్నమని యండ్రు
దీన మిగులు సూక్ష్మ దేహమిందు
బుద్ధి జాగ రాను భూత సంస్కృతులచే
నేను కర్త ననుచు తాన మెఱయు 98

తే. అత్తరిఁ బ్రత్యగాత్మ స్వయం ప్రకాశి
బుద్ధి మాత్ర కోపాధియై పొదల గలిగి
సర్వ సాక్షియై యుండు నిస్సంగి యనగ
బుద్ధ్యుపాధికృతంబులు పొరయ వతని 99

సీ. నిత్యంబు సత్యంబు నిగమాంత వేద్యంబు ధర్మ స్వరూపంబు కర్మ పరము
శుద్ధంబు బుద్ధంబు స్థూలంబు, సూక్ష్మంబు వ్యక్త మవ్యక్తంబు స్వప్రకాశి
ద్రవమునుం గఠినంబు ధ్యానగమ్యము మహా గురువు లఘువును, పరాత్పరము పదము
నిత్య కల్యాణంబు ప్రత్యక్పరబ్రహ్మ మద్వైత మానంద మదియె జ్ఞాన 100

తే. మదియ దేవుండు, మోక్షంబు నదియె, దాని
జేరు నతఁడు పునర్జన్మ జెందఁ బోడు
జ్ఞాన రాశికిఁగాక యజ్ఞాని కంద దరమె ?
కర్మ తెగిననె మోక్షంబు గలుగు తండ్రి 101

తే. వత్తి దీపము వలెఁగాక చిత్తశుద్ధి
కప్పురపు దీపముం బోలి యొప్పెనేని
కర్మ శేషము లేకుండ కరిగి పోవు
దేవ జీవుల కైక్య మీ తెఱఁగు తండ్రి! 102

ఉ. తావును దప్పి చేపవలె తల్లడ మందెడు మానసంబు, తా
దైవముఁజేరుకొన్న తఱి తద్దయు, శాంతము నందు హాయికిఁ
దావల మౌను నిక్క మిది స్థాన బలంబని యెంచి జీవుఁ డా
కేవలుఁ జేర్చు దాక మదికిఁ చలనం బది మాను నేర్చునే ? 103

తే. జ్ఞాన బాణ మ-విప్ర సంగతిని వరుస
బీజ బలమున మలినమై విస్తరించి
స్వచ్ఛమై యధోలోక మోక్షములఁ గాంచు
మంత్రశక్తి బీజాక్షర మహిమ గాదె ? 104

ఆ. కష్టహేతు వగును కాయంబుఁ జేకొనుట
కాయ సంగ్రహంబు కర్మ వశము
కర్మ రాగవైర కారణంబున గల్గు
వాని కారణ మభిమాన మయ్యె 105

తే. వెలిగె నయ్యభిమానం బవిద్య చేత
న య్యవిద్యకు నజ్ఞాన మాదియయ్యె
నిదియు నదియును నావలి యవియు నెల్ల
నావరించుట జీవాత్ముఁడడుగుఁ బడియె 106

తే. వాని నన్నింటినిం గూడ వరుస పెట్టి
వెన్క వెన్కకు మొదలంట వ్రేళ్ళతోడ
జ్ఞాన మను నగ్నితో గాల్చి తాన నిలువ
నక్షయానంద కేవల మాత్మయగును 107

తే. సుకృత దుష్కృతములు రెండు సుఖము దుఃఖ
మిచ్చు సుఖదుఃఖములు రెండు హెచ్చు తగ్గు
సమత వెలయును శీతోష్ణ సలిల మట్లు
సుగతి దుర్గతి కారణాలగుచు నుండు 108

తే. వాని వాని బలాబల ప్రతిభ బట్టి
జీవుఁ డను భవించుచు నుండఁ దావులన్ని
పూర్వకృతములు జన్మకుం బూరకములు
సద్గతీయ వివేవియు సరణి కావు 109

తే. నిర్గుణంబు పరంబ్రహ్మ నిశ్చయంబు
అతనిఁ జుట్టియు త్రిగుణాత్మ కనయముండు
ప్రకృతి విక్షేప రూపయ్యె పరగు తమము
మోహ మజ్ఞాన మనుపేర్ల మోహరించి 110

తే. ఆ ప్రకృతియె శుద్ధ త్రిగుణాత్మిక యగు
నేని, మాయయన్ బేరుతో నెసఁగు - మఱియు
మలీన సత్త్వరజస్తమో మహిత మైన
నది యవిద్య నా నొప్పి యతిశయించు 111

తే. అ య్యవిద్యచే నావృతం బైన యప్పు
బ్రహ్మ చైతన్య మది జీవ భావమందు
మాయచే నవచ్ఛిన్నమే మయ్యెనేని
వ్యాపృతుండన నీశ్వరుం డనగఁ బఱగు 112

క. అమ్మాయాకృత చైత
న్యమ్మను బీజంబునుండి యంకుర మనగా
నెమ్మి మహత్తత్త్వము, తగ
నమ్మహ దావృతమె ప్రాణి - యనగా బఱగెన్ 113

తే. అయ్యది హిరణ్య గర్భ సూత్రాత్మకంబు
దానఁ గల్గె నహంకార తత్త్వ తరువు
అయ్యహంకార చైతన్య మాఖ్య లిడ వి
రాట్టు వైశ్వానరుఁ డగు వైరాజసుండు 114

ఆ. అనగ నొప్పుఁ నయ్యహంకార చైతన్య
మందు నుండి పుట్టె నాకసంబు
శబ్ద గుణక మగుచు సత్త్వాది రూపమ్మై
యందుఁ బుట్టె గాలియతిశ యించె 115

క. గాలికి శబ్ద స్పర్శము
లోలిన్ ద్విగుణంబు లుండి యొప్పుచునుండన్
గాలికి జ్వాల జనించెను
మాలగఁ ద్రిగుణంపు రూపు మఱి మురిపించెన్ 116

తే. అప్పు లుదయించె నాతేజ మందు నుండి
సరస శబ్దాది గుణ చతుష్టయము తోడ
ఆబ్వవచ్ఛిన్న చైతన్య మందు పృథివి
పుట్టె శబ్దాది గంధాంత భూతి దాల్చె 117

తే. అప్పుడమి నుండి యోషధు లుప్పతిల్లె
ఓషధుల నుండి యన్నంబు నుద్భవిల్లె
నన్నమున నుండి పురుష దేహములు బుట్టె
పురుష దేహాలు పుట్టెడు పొల్పు వినుడు 118

తే. అఖిల కారణభూతురా లైన మాయ
త్రిగుణమయి గాన భూతముల్ త్రివిధిఁ దాల్చి
తనరె సాత్త్విక రాజస తామసంబు
లనగ, వాని పంచీకృతాంశాళి వినుడు 119

తే. తామసములైన పంచభూతములు తాము
వేరువేరుగ రెండేసి విభజనముల
నంద నందలి తొలియేను వంశములును
మఱల నొక్కొక్కటే నాల్గు విరుపు లొందె 120

తే. ఆది స్వస్వార్థ భావంబు లవలి యివలి
ఇతర భాగాలతో గూడి యేర్పడంగ
నైన స్థానంబు లవి యెల్ల యవధరింపు
శక్తి కొలదిని వివరింప సాహసింతు 121

క. అని ప్రజ్ఞ బోధ సేసిన
జనపతి యుగళంబు తేరి సమయముఁ దలపన్
మనమున కింపుగఁ దోచెను
దిననాధుని రాక కొంత దీర్ఘత దాల్చెన్ 122

ఉ. ఎప్పుడు వచ్చిరో తెలియ దేరికి రత్నపునాటకంబులో
నొప్పిన వారలెల్లఁ దమ యుండెడు తావుల నుండి పోయి రే
చప్పుడు లేదు తూర్పు దెసఁ జారలు దోచిన భేరి భాంకృతుల్
గొప్పగ మ్రోగ సాగినవి కాక్కొర కోయని కోడి కూయగన్ 123

ఉ. అంతట రాజ దంపతుల కాత్మజ భోధలు మేలుకొల్పగా
జింతలు తీరి ధీరులయి స్వీయ గృహంబును జేరి ప్రజ్ఞ తా
నెంతట దయ్యెనంచుమది నెంచుచు నుండగ తెల్లవారె భా
స్వంతుడు తూర్పు దిక్సతికి భాసుర కుంకుమ బొట్టు నాఁ దగెన్ 124

# చతుర్థాశ్వాసము

మ. హృదగంభీరుఁడు మార్గదర్శి యతి సంప్రాప్టంత యత్నే కృతే
యది యన్ వాక్యము నెంచి పోవుచుఁ బురాభ్యస్త శ్శుభారామమం
దుదయాదిత్యుని బోలు బాలు నొకనిన్ యోగ్యున్ ప్రసన్నాత్మున్ ద
ద్వదనాబ్జద్యుతి రాజరత్న మని తెల్పన్ గాంచె సోత్కంఠుఁడై 1

మ. కలమున్ బొత్తముఁ జేతఁ బట్టుకొని యేక ధ్యాసియై వ్రాయుచున్
తొలి పాఠంబుల జ్ఞప్తి చేసికొనుచున్ దుర్ధర్పులం బోక ముం
దలి పాఠంబులఁ జక్కఁ జూచుకొనుచున్, దాత్పర్యమున్ గోరువా
రలకున్ చెప్పుచు నుండె నాతడవురా ! బ్రహ్మణ్య భావస్థితిన్ 2

చ. కళకళ లాడు నెమ్మొగము కాంచన దేహము మందహాసమున్
సలలిత దైర్ఘ్య బాహుతల సంపద, మెత్తగు మూపురమ్ము, సొం
పొలయు విశాల వక్షము ననూన శుభస్కర వీక్షణావళుల్
పలుకుల తీవి యాత డొక భవ్యుడు రాణ్మణి యంచుఁదెల్పగన్ 3

చ. కని మునిఁ జేరఁబోవ ముని కాంతుని నంతనఁ జూచి లేచి ది
గ్గున, నెదు రేగి మ్రొక్కులిడి కూరిమి మీరగఁ దోడి తెచ్చి యా
సన మిడి భక్తి తత్పరతఁ జాయన నిల్చిన వాని తీవికిన్
మనమున మెచ్చి యిట్లనియె మౌని స్వయంప్రభఁ జాటుమాటలన్ 4

ఉ. ధీరసముద్ర! పుత్ర! భవదీయులు సర్వులు నార్ద్రభావు లీ
తీరు లెరుంగుదున్ దవిలి తెచ్చితి నెంచెదె ? ప్రజ్ఞ యెట్టిదో ?
భూ రమణుండు నీ కొసగుఁ బుత్రిక నెమ్మదిఁ జేసి కొందువే
యా రమణీ మణి ప్రణయ మందని జన్మము జన్మమే మహిన్ 5

ఉ. నిర్మల మానసాంబురుహ నీతి విశారద నిత్యసత్య స
ద్ధర్మ పరాయణార్థ బుధ తారక శ్రీకర మంత్రలక్ష్మి వి
ద్భర్మ సురూప, శారద, సదా సుమనోహర హంసయాన నీ
ధార్మికు రాలి నేలుకొను ధార్మికుఁ డెంతటి ధన్యుఁడో కదా ! 6

క. సిరి నిలిచి యుండు రాజ్యము
నరపతి నీకిచ్చు నిపుడె, నాయది యది యె
ల్లి, రమణి నీయది రమ్మా!
పరిణయ మాడంగఁ బుత్ర! భవ్య చరిత్రా! 7

ఉ. నీ పరివార మీపురము నిండుగ నున్నది రాజ రత్నముల్
నీ పరిచర్య సల్పెదరు, నీవును నీసతి శ్రీ సమేతులై
భూపతి భూరిహృత్కమల భూషలు గాగ వశింత్రు గాత, యీ
పలుకుల్ కుమార! మది నాటిన భావము బోధ యయ్యెనే! 8

ఉ. ఏమి ? సరే కదా! యిపుడ యేగుదమే ! పయనంబు గమ్మ, నీ
కేమి భయంబు లేదు నృపునింట వసించెడు వారలెల్ల నీ
సేమము కోరువారు, నిను జేరెడువారు నిజంబు సూడ నా
రామయుఁ బ్రజ్ఞనాఁ బరఁగు రమ్య, సమాహ్వయ నీకుఁదోడగున్ 9

ఉ. నీవొక నర్త రత్నమవు నిక్కము హేమ లతాంగి యామె, నీ
కావనితా సమాగమ మనంత సుఖప్రద మట్టి భాగ్యమే
తా వరియించి వచ్చె నిను తత్వమెరుంగుమ! దివ్య భావనన్
భా విభవంబు లే దచట భాస్కరు లెందరు సాటివచ్చినన్ 10

క. ఇలఁగల జడధుల మార్పఁగ
గలయది యా ప్రజ్ఞ యంత గంభీరమతిన్
తలకొని తేరన్ గలిగితి
మెలకువతో వర్తనంబు మేలును గూర్చున్ 11

చ. ఇఁక వచియింప నేల ? సకలేప్సితముల్ సమకూడి వచ్చెఁ దా
పక సతిగాఁ దలంపుము నృపాల తనూజను, మున్న యామెకై
యొక దృఢ దీక్షఁ బూనితిని, యుత్తరణం బొనరించితిన్, నృపున్
దికమక వెట్టితిన్ దివులు దీర్పగ వచ్చితి నిన్ను గంటిసూ! 12

ఆ. తగిన వరుడ వీవు తగునామెయును నీకు
దాపయితను నేను దాత రాజు
ప్రజ్ఞ గైకొనంగ బయలు దేరు మటన్న
న ప్పరుండు యతికి ననియె నిట్లు 13

ఉ. చేతులు మొడ్చి మ్రొక్కెదను చేసెద మీకొక విన్నపంబు దే
వా! తమ యానఁగాదన భవత్ప్రతిపాదిత మెల్ల సత్యమే
యేతరి తప్పుఁబో దయిన నేనుఁగు దానముఁ బట్ట నర్హమే ?
భూతకి నాతి యంచుఁ దమ బోటులు వల్కరె ? నాకదేటికో ! 14

శా. రాజశ్రీ పిత యప్పులోనయిన యా రత్నాక రాఖ్యుండు మా
కీజన్మస్థితి నిచ్చి భిక్షువున కర్పించెన్ మముల్ మీకు నీ
రాజేంద్రుం డెటు లాత్మ జాత నొసగుఁ ప్రజ్ఞా ప్రభావంబు మా
కోజో ధర్మ మొసంగదే ? సములకే యుద్వాహముల్ చెల్లుసూ 15

ఉ. పేదకు నాలు శ్రీ యుతుని బిడ్డగు నే నది మానినేని తా
నేది గృహంబునం గనక యించుక కష్టము సేయలేక మ
ర్యాదకుఁ బోవలేక పతి యాతన లంబడఁ జూడ లేక లో
రోదిలి ప్రాణముల్ విడువ రోయదె నీటనొ ? నిప్పునో ? యురిఁ ? 16

చ. దుడకగు నేని వల్లభు నధోగతి పాలొనరింప యత్నముల్
వడివడి సేయు, నీతి పరిపాలన సేయ దభీష్ట పూరుషుఁ
గడక భజించు, లేచి చను, కాంతుని ప్రాణము తీయనెంచు నీ
చెడుగుల మూట జూచి మతి చెల్లునె ? రాసుతఁ బెండ్లి యాడఁ గఁ 17

ఉ. ఇల్లరికంబు సేత యతి నీచమొ ? దైన్యమొ ! చెప్పజాల, నే
నల్లది యొల్లఁ, జూపెద రనాదర మొల్లరు తొంటి ప్రీతి యా
యుల్లము లందు జారు, సుతు డుద్భవ మందిన వంశకర్త యం
చల్లన నల్లు నిల్వెడల నంపుదు రాలును నట్టి దౌనెడన్ 18

క. మోచేతి దెబ్బయే యిది
నీచంబగు వర్తనంబు నీతిజ్ఞునకుఁ
వాచా మగోచరంబది
నాచరితకుఁ జన్నె తమరు నాకు ఘటింపఁ 19

క. తరణోపాయం బెరిగిన
వరమతులే యతులు తాము పరమార్థముగా
పరిణయ సంగతి గూర్చుట
లరయంగా మము బోంట్ల కర్థమగునే ! యనఘా! 20

తే. ఆలు సంసారమున కెల్ల నాదియనగ
అంతులేని సముద్రంబు నందు మునుగ
అజ్ఞుడాశించునే గాని విజ్ఞుఁడెపుడు
ఆశఁజేయఁ డటంచని యనరె బుధులు 21

క. ఆసకు దాసులు కారా
దాసయె తాదాసి యైన ఆతని జగముల్
దాసాను దాసులౌ నను
నీ సంగతిఁ తెలిసి కొంటి నెందుల కాసల్ 22

తే. మనుజుడై పుట్టి తన్నుఁ దా గనని వాడు
తన్నోకించుక లోలోనఁ దలఁప నతండు
దార ధన కాంక్షలం బడి తత్వమరయ
కుండు నాతడు బడయునే ? యొకట ముక్తి 23

తే. ఎన్ని జన్మంబు లెత్తెనో! యింత దాక
దేవ సంప్రార్థ్య మైనట్టి దివ్య తనువు
మానవత్వంబు నాగ సామాన్య మగునె
ముక్తి సౌధపు తుది యెట్టు పుణ్యతమము 24

చ. మనువన జ్ఞానమూర్తి, పలుమారులు బ్రహ్మ తపంబుఁ జేసి యీ
మనుజుల సృష్టిఁ జేసె, నిది మానవ జన్మ విధాన, మిందు నే
ఘనతను గూర్చకే యటుల గాసటఁజెందునె బ్రహ్మ - తన్నుఁదాఁ
గనుటయు ముక్తి నందుటయు గాదె విశేష మిదెందు నున్నదే ? 25

తే. జ్ఞాన దీపపు గూడు శంకర నివాస
మక్షరాభ్యాస మందిర మయిన మనుజ
జన్మమెత్తియు సంసార సాగరమున
మునుగ నొల్లదుసూ! బుద్ధి మునివరేణ్య! 26

ఆ. పెండ్లి పెండ్లి యనినఁ బేరాస పడువాడు
దండి నీట మున్గు తస్కరుండు
తమకు తెలియ నట్టి ధర్మంబు లేముండు
యతి వరేణ్య! తమరె గతులు మాకు 27

తే. ఒక్క మానవ జన్మమే తక్క నితర
జన్మ లేవియు ముక్తికి సాధనములు
కావు కావున బ్రహ్మాది దేవతలును
మనుజ జన్మము లర్థింతు రను దినంబు 28

ఆ. అఖిల దేవగణము నర్పించు మనుజుండు
వివిధ యాగముల హవిస్సునొసగు
అహరహంబు సంధ్య నర్పించు నర్ఘ్యంబు
లివ్వి లేక బుధుల కేవి గతులు 29

క. ఇరుసుకదా! భూలోకము
పరలోకములన్ని దీనిపై బడియెకదా!
స్థిరతఁ నిలిచిన వపురా!
హరియును భువిజొచ్చియుండి యఖిలము నేలుఁ 30

క. శ్రీ కలుగుట భూమహిమయె
కాకుండిన లచ్చి కేవి గతులు ? హరియం
దేకస్థానగ యాయమ
మాకును దోఁబుట్టి, ధాత్రి - మాధవునేలుఁ 31

క. శతగుణ విశ్రుతి గన్నది
క్షితి సర్వంసహ యనంగ సిరికంటెఁ గడున్
శతధృతి యాసిరి కదియే
జతపడమికిఁ జపల యనగఁ జక్కగఁ బిలిచెఁ 32

క. ధర సర్వంసహ విశ్వం
భర వసుమతి రత్నగర్భ - వసుధ యనంగా
స్థిరగోత్ర యచల యయనంగ గా
సిరి ధాత్రికి సాటి యెట్లు ? చిన్నమ్మ సుమీ! 33

క. ఉర్వర యన్నముఁ బెట్టును
సర్వము భరియించు, జనుని క్ష్మాపతిఁ జేయున్
దర్వీకర వాల్మీకుల
కర్వణ మగు తావులిచ్చు, నన్నిటి దాచున్ 34

క. ఎత్తరి కదలదు సుస్థిర
చిత్తంబున బెత్తనంబుఁ జేర్చిన సర్వో
దాత్త, యనంత, సుగుణ పురు
షోత్తముఁ బాలించు సాధ్వి భూసతియె సుమీ! 35

ఆ. పంచ భూత సార బలవత్తరపు శక్తి
బ్రహ్మలోక మందుఁ బరగు నదియు
సాగరాలయంబు సర్వేశ్వరావాస
మైన భూమి యెంత యభవ దంబొ! 36

ఆ. తిరిగి రాక పోరు దివ్య లోకములేలి
పుణ్యకర్త లెల్ల, పుడమి జన్మ
లెత్తకుండ బోవ రెంతెంత వారైన
క్షోణి జ్ఞాను లైన క్షోభ గనరు 37

ఆ. జ్ఞానమార్గమొకటి - మానిపించు భవంబు
ప్రజ్ఞలేని వాడు ప్రగతిఁ జనండు
తజ్ఞులైన వారు తమవంటి వారెగా!
యేమి చెప్పవలయు స్వామి వర్య! 38

ఉ. కారణ దేహ మెత్తితిని, కల్గెను మీదయ జ్ఞాన మబ్బె, దు
ర్వార భవంబు లేదు సుఖ వస్తువు దక్కెను, హాయి చిక్కె నా
కోరిక సిద్ధియయ్యె నికఁగోరగ తగ్గది లేదు, మీరు నా
తీరున కెగ్గసేయ రని దేవ! తలంచెద మీదు సన్నిధిన్ 39

ఉ. సన్నిధి నిచ్చినాడ వొక చక్కని మారుపు కల్గె నా మనో
జ్ఞోన్నతి నేమి చెప్పెద గురూత్తమ! సర్వము మీ మహత్త్వమే!
పున్నెము బాపముల్ బొరయఁ బోలవు ముక్తుడ వెల్గెడ నుండువాడ వీ
చిన్నెలు చిన్నలీల లవిసేసెదు సేయ వలౌక్య వర్తనన్ 40

చ. అనివచియించు రాజసుతు నాయతి చంద్రుడు వీపుఁ దట్టి రా
ణ్మణి! త్వ దభీష్ట సిద్ధి యగు మాకును నీవలె నున్నదిష్ట మా
వినయ విభుండు గన్నసుత వేద శిరంబుల సారమెల్లఁ ద్రా
వినది సుమీ! ప్రమాద మనిపించదు. భద్రమయొ గ్రహించిరన్ 41

ఉ. తప్పక చేయి బట్టుము సదా ముదమందుము నీవు పడ్డయా
త్రిప్పులురావు భూపతి హృదిన్ వెలుగొందుము ప్రజ్ఞయాత్మయం
దెప్పుడు చీకు మాన్పు సతు లెవ్వరు సాటికి రారు దాని నేఁ
దప్పక గూర్తు మోక్షగురుతత్వము తానయి నిన్ వరించె సూ! 42

ఉ. నీకిక జన్మరాదు, జననీ జనకుల్ గన లేరు ప్రజ్ఞ యే
నీకగుతోడు, విశ్వమయు నిర్మలహృత్కమలంబె పీఠి నీ
కే కలుషంబులుం బొరయ వెంతటి కార్యమొ గుర్తుబట్టుమిం
దాక మదీయ యత్న మిటు తప్పక సేయుమ రాజరత్నమా! 43

చ. అని యతి పల్కరాణ్మణి కయాచితల లబ్ధ పరార్థమే కదా
కొనదగు, నీ మహాత్ముడును గోరిన లభ్యుడె? కాగనీ
జననము ధన్యతన్ బడయు శాంతత గల్గును ఒప్పుకొమ్ము యా
ముని వచనంబు త్రోసిచన బోలదు సుమ్మయటంచు దోపగన్ 44

క. ఆయతి పాణి గ్రహణము
సేయంగా ప్రజ్ఞయతని చిత్తము జొచ్చెన్
చేయున దేమియు దోపదు
హాయియె యగపట్టె నతని కా గురు మహిమన్ 45

ఆ. రాకుమారుడంత భ్రమర కీట న్యాయ
మొప్ప మారె నుభయులొక్కటైరి
భేద భావమేమి లేదుగా వారిలో
సాధు సంగమెంత శాన్తి దంబో 46

చ. మనమున చింతబాసె యనుమానము మానె యతీశువెంబడిన్
ఘనమతి కౌస్తుబుండరుగగైకొని యాయతి వచ్చె చెచ్చెరన్
వినయ ధరాధినాధు బహువిస్తృత నిర్మల సత్సభాంగణం
బునకు జనుల్ ప్రముగ్ధులయి పోవగ కౌస్తుభ దివ్య దీప్తికిన్ 47

ఉ. ఎచ్చట జూచినన్ శుభము లేర్పడి యున్నవి రాజరత్నముల్
వచ్చి బరాబరుల్ సలుప భాసురమంగళ వాద్యానాదముల్
ముచ్చట గొల్పు చున్నవి యమూల్యము తోరతనాల పందిరుల్
పచ్చని తోరణా వళుల భాసిలుచుండెను వింతవింతలై 48

ఉ. గుంపులు గుంపులై జనులు కూడు చునుడిరి సందులేదు క్రొం
దంపతు లెట్టు లుందురో కనందగు వింత వివాహమంచు భా
షింపుచు నుండవచ్చె మఱి శేఖరుతో యతిశేఖరుండు రా
నింపగు చోట కంపులుదయించె నటన్న చనియెంచి రెల్లరున్ 49

క. ముందర జనియెడు యతికట
నందన నిడునంట రేడు న్యాయము కలదే
అందరు, కొందరు కౌస్తుభ
నందంబును చూచి చూచి అబ్బుర పడుచున్ 50

శా. ఎవ్వండీతడిదేమి తేజము! మహోత్కృష్టంబుగా నున్నదే
ఎవ్వారింతటి వారు వీనిగని యా యింద్వింద్ర పుత్రాదులం
దెవ్వండైనను మోము నెత్తగలడేయీ యందగాడాయతిన్
రవ్వంతైనను వీడ డింతకు తగున్ ప్రజ్ఞా విభుండైన చో 51

క. ఆరాజ తీవి నడకలు
నారాజ ముఖంబు చూపు నాయత భుజముల్
ధీరోదాత్త స్ఫురణలు
పేరురమున వయసు సేరు ప్రియమును గొల్పున్ 52

క. కావలె నితడే ప్రజ్ఞకు
శ్రీవలె మాతుర్మ మగుల చెన్నారవలెన్
భూవరు నెదలో మార్పును
తేవలె భగవానుడింత తీర్పక యున్నె 53

క. అని జనులనుకొను చుండగ
జనానాధుండెదురు పోయి స్వామినిదెచ్చెన్
ఘన పీఠములిడె యతి యా
మణివరుగూర్చుండ జేసి మానవ పతితో 54

సీ. శ్రీవత్సు డీతండు జితభాను తేజుండునబ్జమిత్రులకన్న నధికుడితడు
భువన రాణ్మణి యీ తడవనీ ధరోన్నతుం డాశలన్నింటి మించు నతడితండు
అమృత భావుండీంత డపహృత స్థానుండు పన్నగారిని మించు భవ్యుడితడు
శంఖ చక్ర స్థాయి సర్వంకషుండీత డఖిలేశు హృత్సీము, కతిధియితడు 55

తే. కౌస్తుభాభిఖ్యుడీతండు కంటె భూప
యితడు నీ చుట్టమైన నింకేమి కొఱత
ఏది నీ ప్రజ్ఞ సుమమాల నేయబంపు
మాామెకై కదా! యీా యత్న మంత నడచె 56

మ. లలిత ప్రజ్ఞ ధరాతలంబున మహోల్లాసంబు దీపింపనా
తొలి విద్యా విభవంబు లంది సుమనస్తోమంబు సేవింప ని
శ్చలవృత్తిన్ బహుసౌఖ్యదాయి యగుటన్ సద్భావనంజూచి నీ
వలనన్ బొందితి నిచ్చుకొంటి తగదే వాల్లభ్య మూహింపగన్ 57

చె. వినయ ధరాధిపా విను వివేకము-కావలె మాట మాటలో
న్గనవలె ప్రజ్ఞ ప్రజ్ఞ వలనన్ జగ మంతయు నవ్యనవ్యతల్
గనవలె సౌఖ్య మందవలె కౌస్తుభ దీప్తికి తోడుగావలెన్
మనవలె నింక నీ మనసు మాదగు కృత్యము తీరె నిప్పుడున్ 58

మ. ప్రతిభాశోభిత మైన ప్రజ్ఞ మణి సామ్రాట్కౌస్తుభాలంబమున్
ధృతిమైగన్న దికేమి గావలె నిదే ధీశాలి యర్థించు ధ
న్యత నీదేనృప! కౌతుక క్రియకునైయాచారమున్ సల్పుమా !
యతినే నేగెద నంచునాముని సనెన్ త్యక్తాత్మ సందేహియై 59

క. తజ్జుండగు విభుడెదలో
ప్రజ్ఞాకౌస్తుభము మెరయ పరిపాలింపన్
విజ్ఞత ధరనిడె ధరయు ను
పజ్ఞతతో రత్నగర్భ భావము దాల్చెన్ 60

క. ప్రజ్ఞా కౌస్తుభ భారం
బజ్ఞత ధరియింప జాల దచలా ధీశుల్
జిజ్ఞాసుల్ ధరియింతురు
విజ్ఞేయము యత్నసిద్ధి విషయము దేవా! 61

తే. పరున కీయంగ నొల్లని భావి నయ్యు
కృతిని సాక్షాత్పరాత్పరు కేల నిడితి
పూలు ఫలములు నావియా ! చాల మేలు
స్వస్తి లోకాయ శుభమస్తు శాన్తి రస్తు 62



రచన

## బ్రహ్మశ్రీ మద్దులపల్లి వీరరాఘవశర్మ

జననము **18-1-1915** మరణము **27-9-1974**

మాతండ్రి గారైన బ్రహ్మశ్రీ వేదమూర్తులైన మద్దులపల్లి వీర రాఘవ శర్మగారు ప్రకాశం జిల్లా పట్టాభిరామాపురం అగ్రహారమునందు జన్మించారు. సరిపల్లె పాఠశాలలో వేదములను సంస్కృతాంధ్రములను అభ్యసించారు మహబూబ్‌నగర్ జిల్లా కోస్గి గ్రామంలో వేదాధ్యాపకులుగా కొంతకాలము పని చేశారు. కర్నూలు జిల్లాలోని నంద్యాల గ్రామము లోగల పురపాలకోన్నత పాఠశాల యందు తెలుగు పండితులుగా పని చేసి పదవీవరమణ తరువాత మహబూబు నగర్ జిల్లా కోడంగల్ లోగల ఓరియంటల్ పాఠశాలలో సంస్కృతాధ్యాపకులుగా పనిచేశారు. వీరు రచించిన ఈ ప్రజ్ఞా కౌస్తుభమునకు తగిన ఆర్థికసహాయము చేసిన తిరు మల తిరుపతి దేవస్థానము వారికి కృతజ్ఞతలు తెలియజేస్తూ.

కుమారులు : మద్దులపల్లి నరసింహమ్,

మద్దులపల్లి పాండురంగమ్.